# నీతి శతక రత్నావళి

(సుమతి, యేనుగు లక్ష్మణ కవి విరచిత-
నీతి శతకము. వేమన)





☎ 73444.

రోహిణి పబ్లికేషన్స్

వి.వి.వై. రెడ్డి మునిసిపల్ కాంప్లెక్స్

రాజమండ్రి - 533 101.

# NEETI SATAKA RATNAVALI



**Rs. 25/-**

**First Edition Nov. 94**
**Second Edition Nov. 98**

Cover Disign . **BALI**

D. T. P. at
**PADMAVATI TYPE SETTERS**
RAJAHMUNDRY

*Printed by :*
**SWAMY OFFSET PRINTERS**
Gandhi Nagar, VIJAYAWADA - 3
Phones : 578211, 572832

Published by :
**ROHINI PUBLICATIONS**
A. C. Y. Reddy Municipal Complex,
RAJAHMUNDRY – 1
Phone : 73444.

# ప్రకాశకుల విజ్ఞప్తి

ప్రజలకు, ముఖ్యంగా విద్యార్థులకు వివేకాన్ని కలిగించే సాహిత్యాన్ని అందించాలనే ఉన్నతాశయంతో స్థాపించబడిన సంస్థ- మా **"రోహిణి పబ్లికేషన్స్"**.

ఈ పవిత్ర ఆశయ సాధనలో భాగంగా యుగపురుషుడు, ప్రముఖ సంఘ సంస్కర్త అయిన శ్రీ కందుకూరి వీరేశలింగంగారు రచించిన **"నీతి కథా మంజరి"**ని, నీతి చంద్రికలోని చిన్నయసూరి భాగాలైన మిత్రలాభం, మిత్రభేదంతో వీరేశలింగంగారి భాగాలైన సంధి, విగ్రహములను జతపరచి, మరల పరిష్కరింపజేసి ఒకే సంపుటముగా **"సంపూర్ణ నీతి చంద్రిక"**గా ముద్రించి మీ ముందు వుంచాము.

ప్రస్తుతం భాషా జ్ఞానానికి, లోకజ్ఞతకు దోహదపడే ఈ **"నీతి శతక రత్నావళి"** పుస్తకాన్ని మీకు సగర్వంగా అందిస్తున్నాము స్వీకరించి వివేకాన్ని పెంపొందించుకోగలరని ఆశిస్తున్నాము.

**- రోహిణి పబ్లికేషన్స్**

**రాజమండ్రి-1.**

# విషయ సూచిక

"సుమతి"

(ఆంగ్ల తాత్పర్యము - సి.పి. బ్రౌన్) : 5

యేనుగు లక్ష్మణకవిగారి

"నీతి శతకము"

(ఆంగ్ల తాత్పార్యము పి. భాస్కరరావు) : 19

"వేమన"

(ఆంగ్ల తాత్పర్యము - సి.పి. బ్రౌన్) : 121



# సుమతి శతకము

అధరమును కదల నియ్యక
మధురామృత భాష ఉడిగి మౌనస్థుండై
యధికార రోగ పూరిత
బదిరాంధక శవము జూడ పాపము సుమతీ.

He moves not his lip! refrains from words flowing with honey and nectar! ; he is a solitary. A deaf and blind corpse swollen up with the disease of authority is indeed a shocking object.

అప్పుగొని చేయు విభవము
ముప్పున బ్రాయంపుటాలు, మూర్ఖుని తపముం
దప్పరయని నృపురాజ్యము
దెప్పరమై మీద కీడు దెచ్చుర సుమతీ.

Luxury supported by contracting debt, a youthful wife married in old age, the devotions of the stubborn and the dominion of a prince who will not try crime - these incur inevitable misery, Oh sage.

అప్పిచ్చు దాత, వైద్యుడు
నెప్పుడు ప్రవహించునట్టి యేరును, ద్విజులుం
జొప్పడిన యూర నుండుము
చొప్పడకున్నట్టి యూరు చొరకుము సుమతీ.

A liberal lender, a doctor, a perpetually flowing stream and the twice born Bramin — abide in a town where these are found. Enter into no village where these are unknown.

ఆకొన్న కూడె యమృతము
వాకింపక యిచ్చువాడె దాత ధరిత్రిన్
సోకోర్చువాడె మనసరి
తేకువ గలవాడె వంశతిలకుడు సుమతీ.

To the hungry man dry bread is ambrosia. He that bestoweth without reproving is the greatest benefactor on earth. He who puts up with an attack is the sound hearted and the man of spirit is the ornament of his race.

ఇచ్చేదె విద్య, రణమున
జచ్చేదే మగతనంబు, సత్కవివరులన్
మెచ్చేదే చదువు, వాదుకు
వచ్చేదే యవగుణంబు వసుమతి సుమతీ.

Liberality is the only wisdom. To die in battle is manliness. That is the reading which the noblest of inspired poets approve, and to enter into disputations is indeed a vice.

ఇమ్ముగ జదువని నరు, నో
రమ్మా యని పిలిచి యన్న మడుగని నోరుం
దమ్ముల బిలువని నోరుం
గుమ్మరి మను ద్రవ్వినట్టి గుంటర సుమతీ.

The mouth that will not read, the mouth that will not cry, 'Mother, give me food', the mouth that will not invite a brother is a pit viler than that in which a potter treads clay.

ఉడు ముండదె నూరేడులు
పడియుండదె పాము నూరు పదు లారీతిన్
మడుగున కొక్కెర యుండదె
కడు నిల బురుషార్థపరుడు గావలె సుమతీ.

Will not a guana live for a century? Will not a crawling snake in like manner live a hundred times ten years? Will not a crane live long in a lake? Let our hopes be fixed on a higher world. (Let us be devoted to manly pursuits.)

ఉపకారికి నుపకారము
విపరీతము గాదు సుమ్మీ, వీడుకు వీడే
యపకారికి నుపకారము
నెప మెన్నక సేయువాడె నేర్పరి సుమతీ.

That kindness should be shown to the kind is no marvel, for it is ;merely an exchange. But he who shows kindness to the unkind without laying a fault to him is the wisest of men.

ఎప్పటి కెయ్యది ప్రస్తుత
మప్పటి కా మాట లాడి యన్యుల మనసుల్
నొప్పింపక తా నొవ్వక
తప్పించుకు తిరుగువాడు ధన్యుడు సుమతీ.

He who uses on ;every occasion the words suitable thereto who grieveth not the heart of his neighbour, and so behaveth as himself to avoid pain this is the beneficent man, O my friend.

ఏరకుమీ కసి గాయలు
దూరకుమీ బంధు జనుల దోషము సుమ్మీ
పారకుమీ రణ మందున
మీరకుమీ గురువు లాజ్ఞ మేదిని సుమతీ.

Pluck not raw fruits. Reproach not thy relations, for it would be a sin indeed. Fly not in battle. Transgress not thy master's command.

ఓడలు వచ్చును బండ్లనె
యోడలనె బండ్లు వచ్చు నొక్కొక తరి నా
యోడలు బండ్లును వలెనే
వాడంబడు కలిమిలేమి వసుమతి సుమతీ.

Boats can be carried upon carriages and carts also can be put upon ships. Just like boats and carriages, are good luck and bad luck alternately in power.

కమలములు నీట బాసిన
కమలాప్తుని రశ్మిచేత గమలిన భంగిన్
దమతమ నెళవులు దప్పిన
దమ మిత్రులు శత్రు లౌట తథ్యము సుమతీ.

Like as the water- lily when deserted by the retiring wave withers in the rays of the lily-loving Sun, so when we quit our natural situation, verily do our friends become our foes.

కూరిమి గల దినములలో
నేరము లెన్నడును దోచనేరవు, పతి కా
కూరిమి తొలగిన భటుపై
నేరములై పనులు తోచుచుండు నిక్కము సుమతీ.

During the period that favour lasts, however many faults we commit, they will not be scrutinised by the prince; but the acts of the servant who has lost his favour will assuredly be looked upon as crimes.

కొరగాని కొడుకు పుట్టిన
కొరగామియె కాదు తండ్రి గుణముం జెరుచుం
జెరుకు తుద వెన్ను పుట్టిన
జెరుకున గల తీపి యెల్ల జెరుచును సుమతీ.

If a worthless son be born, his worthlessness is not all; he ruins his father's excellence too, as an ear springing on a flowering sugar cane destroys all the sweetness of the cane.

చేతులకు తొడవు దానము
భూతలనాథులకు తొడవు బొంకమి ధరలో
నీతియె తొడ వెవ్వారికి
నాతికి మానంబు తొడవు నయముగ సుమతీ.

Liberality is an ornament to the hand. Veracity is an ornament to the lords of the earth. Morality is an ornament to every one. Modesty is an ornament to a woman.

తన కలిమి యింద్రభోగము
తన లేమియె సకల లోక దారిద్ర్యంబుం
తన చావు యుగము గ్రుంకుట
తను వలచిన యదియె రంభ తథ్యము సుమతీ.

Your own wealth is to you the treasures of Plutus, and one's own poverty truly is considered as the poverty of the whole world. His own death is the destruction of all time. She indeed whom you love is Venus, such is the case.

తన కోపమె తన మృత్యువు
తన శాంతమె తనకు రక్ష, దయ చుట్ట మగుం
దన సంతోషమె స్వర్గము
తన దుఃఖమె నరక మండ్రు తథ్యము సుమతీ.

A man's wrath is the cause of his death ; but his patience shall gain him protection, favour and kindred. One's own enjoyment is esteemed as heaven ; anyone's own grief they (verily) consider as hell.

దానం బివ్వని కుడువని
వాని ధనము రాజచోర వహ్నుల జేరుం
గానల నీగలు గూర్చిన
తేనియ తెరవరుల జేరు తీరున సుమతీ.

The wealth of him, who will neither bestow nor consume it, is seized by the prince or by theives or by fire as the honey hive stored by bees in the forest falls into the hand of the wayfarer.

ధనపతి చెలికాడై యెప్పు
డె (నయంగా) శివుడు భిక్ష మెత్తగవలెసెం,
దనవారి కెంత గలిగిన
దనభాగ్యము దనకు గాక తప్పునె సుమతీ.

Though the god of wealth is his ally, still is Siva constrained to live on alms. Whatever wealth your relations possess, will your own fate fail to befall you ?

నట్టేటి నీట నురుకకు
మిట్టను వరిచేను గొనకు, మే లెంతైనన్
గొట్టైన సుళ్లు గలిగిన
నట్టువ హయమైన గొనకు నయముని సుమతీ.

Rush not into the waters of the mid stream. Take not a highlying field for corn whatever advantages it promise, nor buy a horse with unpropitious marks even though it has been taught to dance.

నడువకుమీ తెరు వొకడవు
కుడువకుమీ శత్రునింట కూహక మతివై
ముడువకుమీ పర ధనములు
నొడువకుమీ యొరుల మనసు నొవ్వగ సుమతీ.

Walk not in a path alone. Eat not in the house of an enemy, thou having a base heart. Appropriate not thy neighbour's goods. speak not so that thy neighbour's heart may be grieved, Oh man of prudence.

నవరస భావాలంకృత
కవితా గోష్ఠియును మధుర గానంబును దా
మవివేకి యెదుట జేసిన
జెవిటికి సంకూదినట్లు సిద్ధము సుమతీ.

If verse or colloquy adorned with the ninefold sentiments of taste, if sweet song be exhibited to him who is devoid of judgement, verily it is as though the melodious shell were sounded in the ear of the deaf.

[illegible] లేని సంపద
[illegible] దక్కక పోవున్
[illegible] జుంటీగలు
[illegible] తేనె మార్గము సుమతీ.

Wealth that does no good to his neighbour, hoard it whoever may will not avail him. It is like honey industrially stored up by bees.

పెట్టిన దినముల లోపల
నట్టడవుల నున్న గలుగు నానార్థంబుల్
పెట్టని దినముల కనకపు
గట్టెక్కిన నేమి లేదు గదరా సుమతీ.

While your happier days last, all things shall be yours even though you be in the heart of the forest. But in an unappointed time if you were even to scale Olympus (lit. the golden mountain), you would get no advantage.

పేదరిక మంత దోషం
బేదియు లేదీ ధరిత్రి, నీశ్వరు డెరుగుం
బేద బొడగన్న వారలు
కాదని దూరుదురు శవము గతి గని సుమతీ.

God knows there is no sin in this world so great as poverty. Those who set their eyes on a poor man slight him and revile him as if he were a dead body.

బలవంతుడ నా కేమని
పలువురతో నిగ్రహంబు బడయుట మేలా
బలవంతమైన సర్పము
చలి చీమల చేత జిక్కి చావదె సుమతీ.

I am strong, what care I? says he; but what good will he get of incurring the hatred of others? Did never a snake however mighty die by falling into the power of black ants?

శుభములు బొందని చదువులు
నభినయమున రాగరసము లందని పాటల్
గుభగుభలు లేని కూటమి
సభ మెచ్చని మాట లెల్ల చప్పన సుమతీ.

Studies that tend not to happiness, the song unadorned with graceful gesture and sweet notes, the embrace devoid of emotion and the speech unapproved by the court are all tasteless!

సిరి దా వచ్చిన వచ్చున్
సరసం బగు నారికేళ జలముల భంగిన్
సిరి దా బోయిన బోవుం
గరి మ్రింగిన వెలగపండు క్రమమున సుమతీ.

Fortune visits you spontaneously like as sweet water is found in a coconut. Fortune disappears when she pleases as does the pulp of the tough wood - apple which the elephant has swallowed.

# శ్రీ యేనుగు లక్ష్మణకవి

# నీతి శతకం

క. అచ్ఛము దిక్కాలాద్యన
వచ్ఛిన్నానంత చిద్ఘనంబు నిజ
స్వచ్ఛానుభూతిమానము
నచ్ఛాంతము తేజ మే నజస్రముఁ దలఁతున్.

తా. దేశకాలాది పరిమితిలేక జ్ఞానమాత్ర స్వరూపమై అనుభవముచేతనే ఎఱుంగఁ దగినదై శాంత మయిన జ్యోతిస్స్వరూపమగు పరబ్రహ్మము నకు నమస్కారము.

The Almighty, the Light (Jnana) who has within him the Qualities of peace, Divine-knowledge, Universal existing power, known only to the divine scholors, my adores (Namaskarams) to such qualitative Supreme being.

(1)

తే. బోద్ధలగువారు మత్సరపూర్ణమతులు
ప్రబలగర్వ విదూషితుల్ ప్రభువు లెన్న
నితరమనుజు లబోధోపహతులు గాన
వాఙ్ముఖమున జీర్ణమయ్యె సుభాషితంబు.

తా. తెలిసినవారలు అసూయతోనున్నారు. ప్రభువులు గర్వాంధులు సామాన్యులకు వినునంతటి తెలివిలేదు. కావున నేను చెప్పదలచిన సుభాషితము నాయందే అణంగిపోయినది.

I am constrained to retain these eloquent words (Subhashitams) within me, because the knowledgable persons are with jealous and will not give heed to these eloquent words, kingly people (Bhusuras) are blind with their proudness and powers, the common people cannot understand these words.

(2)

క. తెలియని మనుజుని సుఖముగఁ
దెలుపం దగు సుఖతరముగ దెలుపఁగ వచ్చున్
దెలిసినవానిం దెలిసియుఁ
దెలియనినరుఁ దెల్ప బ్రహ్మదేవుని వశమే.

తా. తెలియనివానికి సులభముగఁ దెలుపవచ్చును చక్కఁగ దెలిసినవానికి సమాధానము చెప్పుటన మఱింత సులభము. స్వల్పజ్ఞానము కలిగి సర్వజ్ఞుఁడనని గర్వపడువానిని సృష్టికర్తయగు బ్రహ్మయు రంజింపజేయనేరదు.

We can teach a layman easily, we can teach a man who knows and can pacify him, but to teach a half knowledged person is a difficult task because of the reason that he acts as if he knows everything, Even God (Brahma) cannot teach him and cannot gladden him.

ఉ. మకర ముఖాంతరస్థ మణిమానికమున్ బెకలింపవచ్చుఁ బా
యక చలదూర్మికానికరమైన మహోదధి దాటవచ్చు మ
స్తకమునఁ బూవుదండవలె సర్పమునైన ధరింపవచ్చు మ
చ్చిక ఘటియించి మూర్ఖజన చిత్తముఁ దెల్ప నసాధ్య మేరికిన్.

తా॥ మొసలి నోటిలోని కోఱల నడుమనుండు రత్నము (ముత్యము) నైనను ప్రయత్నించి బయటికిఁ దీయవచ్చును. పెద్దయలలు గల సముద్రమునైనను దాఁటవచ్చును. కోపముచేత బుసకొట్టు పామునైనను పూలదండవలె శిరమునఁ దాల్పవచ్చును. కాని మహాగ్రహముచేత మూఢుఁడయిన వాని మనమును సమాధాన పెట్టుట సాధ్యముకాదు.

It is practically impossible and difficult to gladden a stupid person, than to acquire a gem from the Jaws of an alligator (Makara), to cross the ocean and to garland the angry cobra.

తే. తివిరి యిసుమునఁ దైలంబు దీయవచ్చుఁ
దవిలి మృగతృష్ణలో నీరు ద్రావవచ్చుఁ
దిరిగి కుందేటికొమ్ము సాధింపవచ్చు
జేరి మూర్ఖుల మనసు రంజింపరాదు.

తా॥ ప్రయత్నపడి ఇసుకనుండి కూడ చమురు తీయవచ్చును. ఎండమావులందు సైతము నీరును సంపాదించి త్రాగవచ్చును. తిరిగి తిరిగి కుందేటి కొమ్మునైనను సాధింపవచ్చును. కాని దురాగ్రహముగల మూఢుని మనస్సును మాత్రము సమాధాన పెట్టుటకు సాధ్యముగాదు.

We can get oil from sand, we can get water from mirage, we can create horns to the rabbit but we cannot gladden a stupid.

మ. కరిరాజున్ బిసతంతు సంతతులచేఁగట్టన్ విజృంభించువా
డరవజ్రంబు శిరీషపుష్పములచే నూహించు భేదింపఁ దీ
పు రచింపన్ లవణాబ్ధికిన్ మధుకణంబుం జిందు యత్నించు ని
ష్ఠురజన్ మూర్ఖులఁ దెల్పునెవ్వఁడు సుధాధారానుకారోక్తులన్.

తా॥ మదపుటేనుఁగును తామరతూటి దారములో బంధింపఁ జూచువాఁడును. దిరిసెన పుష్పకొనచేత వజ్రమును గోయుజూచువాఁడును. లవణ సముద్రమునందలి నీరును తియ్యగాఁ జేయుటకు ఒక తేనెబొట్టును విడుచువాఁడును, మంచి మాటలతో మూర్ఖులను సమాధాన పెట్టదలచువాడును సమానులు.

He who tries to tie any elephant with the strings of lotus, he who wants to cut the diamond with Rain-Flower (Dirisena Flower) he who wants to make the seawater sweet by adding a drop of honey and he who tries to satisfy a fool with good talks are of same rank and are of equal nature.

(6)

తే. స్వవశము హితంబు మూఢతాచ్ఛాదనంబు
గాఁగ నీగతి నిర్మించెఁ గమలభవుఁడు
సర్వవిదు లగుమనుజులు సభలలోన
మౌనమె విభూషణము మూఢమానవులకు.

తా॥ బ్రహ్మ మూఢులు తమ మూఢత్వమును దాఁచుకొనుటకుఁ గాఁదమకు స్వాధీనమైయుండునట్లు మౌనమును సృజించెను. పండితుల యెదుట మౌనముగ నుండుటయే మూఢుల కలంకారము.

The Stupids are always silent before the learned people in order to hide their stupidity. That is the ornament for them.

చ. తెలివి యొకింత లేనియెడ దృప్తుఁడ నై కరిభంగి సర్వమున్
దెలిసితి నంచు గర్వితమతిన్ విహరించితిఁ దొల్లి యిప్పుడు
జ్జ్వలమతులైన పండితుల సన్నిధి నించుక బోధశాలి నై
తెలియనివాడ నై మెలఁగితిం గతమయ్యె నితాంతగర్వమున్.

తా॥ నేను కొంచెముగఁ దెలిసికొని యుండు కాలమున మదగజమువలె మదించి నేనే సర్వజ్ఞుఁడ నని తలంచితిని. పిదప పెద్దలవలన కొద్దికొద్దిగ ఎప్పుడు తెలిసికొంటినో అప్పుడు నేను మూర్ఖుఁడ ననియు నాకేమియుఁ దెలియ దనియు తలంచి జ్వరమును వదలి సుఖపడినట్లు నన్నుఁ బట్టియున్న గర్వమును విడిచి సుఖపడితిని.

After learning from scholarly persons, I became very happy like that of a man who had relieved from fever, Prior to learning I behaved as an elephant in rut.

8)

చ. క్రిమిసముదాయ సంకులము గేవల నింద్యము పూతిగంధహే
యమును నిరామిషంబును ఖరాంగభవం బగునెమ్ము గుక్క దా
నమలుచుఁ జెంతనున్న సురనాథునిఁ గన్గొని సిగ్గుఁ జెంద ద
ల్పమని నిజస్వభావముఁ దలంపదు నీచపుఁ బ్రాణి యెయ్యెడన్.

తా॥ కుక్క పురుగులు గలిగినదియు జొల్లుచేత తడిసినదియుఁ గంపుకొట్టుటచే రోతపుట్టించునదియు మాంసము లేనిదియునగు గాడిద యెముకను అతిప్రీతితో కొరుకుచు తన సమీపమునకు దేవేంద్రుడు వచ్చి నిలిచినను చూచి సిగ్గుపడదు. నీచప్రాణి తాను గ్రహించిన వస్తువు తుచ్ఛమా కాదా యను విషయమును లెక్క చేయదు గదా!

The wicked people will never mind to do any sort of harm to others without any reason. A vile creature like dog will not hesitate to eat the rotton bones with munch, Nothing can stop the wicked people they can be ranked as vile.

(9)

శా. ఆకాశంబుననుండి శంభునిశిరం బందుండి శీతాద్రి సు
శ్లోకంబైన హిమాద్రి నుండి భువి భూలోకంబునందుండి య
స్తోకాంభోధిఁ బయోధి నుండి పవనాంధోలోకముం జేరె గం
గాకూలంకష పెక్కు భంగులు వివేక భ్రష్ట సంపాతముల్.

తా॥ గంగానది ప్రథమమున నాకాశము నుండి ఈశ్వరుని తలమీదను, అచటి నుండి హిమవత్పర్వతము మీదను, ఆ పర్వతము నుండి భూమి మీదను, భూమి నుండి సముద్రమునకును, అచ్చట నుండి పాతాళమునకును వచ్చెను. గొప్ప స్థితి నుండి తొలగినవారికిదే విధముగ బలువిధములగు పాట్లు సంభవించును.

A down fall of a man can be compared with Ganges. As Ganges came down from heaven to Lord Siva's head from there to earth from there to the sea and from there to hades.

చ. జలముల నగ్ని ఛత్రమునఁ జండమయూఖుని దండతాడనం
బుల వృషగర్దభంబులను బొల్పగుమత్తకరీంద్రమున్ సృణిం
జెలఁ గెడురోగ మౌషధముచే విషముందగుమంత్ర యుక్తి ని
మ్మలఁదగఁజక్కఁ జేయనగు మూర్ఖునిమూర్ఖత మాన్పవచ్చునే.

తా॥ ..గ్నికి జలంబును, ఎండకు గొడుగును, మదగజంబునకు అంకుశంబును, ఎద్దు గాడిద మొదలగు జంతువులకు గ్రయు, రోగంబునకు వివిధంబులగు మందులును, సర్ప విషంబునకు బలు విధ... ..గు మంత్రంబులును శాస్త్రములందు నివారకములుగ చెప్పబడియున్నవి. కాని మూర్ఖుని మూర్ఖత్వమును పోగొట్టునట్టి యౌషధ మేశాస్త్రమునందును జెప్పబడలేదు.

No science has yet specified how to alter a stupid and his stupidity. We can control fire by water, Sun beams by an umbrella, elephant by a goad (An..usha), bull and an ass by a lash, diseases by m.. ..cines, venom by a sacred text.

ఉ. సకల కళావిభూషితులు శబ్దవిదుల్ నయతత్త్వబోధకుల్
ప్రకటకవీంద్రు లేన్నృపతి పజ్జను నిర్ధను లై చరింతు రా
విక్రృతపు జాడ్య మాదొరది విత్తములేకయు వారు పూజ్యు లం
భకజన దూషితంబులు ఘనంబులు గావె యమూల్య రత్నముల్.

తా॥ వ్యాకరణాది శాస్త్ర పఠనముచేత నిర్దుష్టముగను మనోహరంబుగను
తా॥ పలుకుచు విద్యార్థులకు శాస్త్రంబుల బోధించుచు సుప్రసిద్ధులయిన
పండితులు ఏ ప్రభువు నొద్దనైనను ధనవిహీను లయి యుండిరేని
అది ఆప్రభువు యొక్క తెలివి లేమినే తెలుపును. రత్న పరిజ్ఞానములేని
వర్తకు డమూల్యమణులను తక్కువ వెలగల వానినిగా చెప్పినంత
మాత్రముచేతనే ఆ రత్నంబులకు లోపము రాదుగదా!

If a scholorly person suffers out of poverty it is not his fault. The fault lies with the king of the region. As, if the gem is not valued properly it is not the mistake of the gem, but it is the mistake of the (valuer) dealer. The value of the Gem and the reputation of the Scholor will never degrade.

ఉ. హర్తకుఁ గాదు గోచర మహర్నిశమున్ సుఖపుష్టిసేయు స
త్కీర్తి ఘటించు విద్య యను దివ్యధనం బఖిలార్థికోటికిం
బూర్తిగనిచ్చినన్ బెరుఁగుఁ బోదు యుగాంతపు వేళనైన భూ
భర్తలు తద్ధనాధికుల పట్టున గర్వము మాను టొప్పగున్.

తా॥ విద్యాధనమును దొంగలు హరింపలేరు. అది (ధనమువలెగాక) ఎల్లప్పుడు సుఖమునే కలుగజేయును. కోరినవారి కెల్లప్పు డిచ్చుచుండినను మరింత వృద్ధినందును. ప్రళయకాలమప్పుడును నశింపదు. ఇట్టి విద్యాధనముగలవారి యెడ సామాన్య ధనముగల రాజులు దురాగ్రహముడుగవలయును. వారి నెదుర్కొనుట కెవ్వరును జాలరు.

Education is the one that cannot be stolen, it will be increased by, on every teaching, it gives immortal happiness, it will never lost even if it has been taught to entire Universe. It remains even after deluge (Kalpanatham). So the wealthy kings should not be headstrong towards the educated (Scholorly) persons. None can face scholorly persons.

తే. ప్రభులు పండితు లగువారి వలన గర్వ
కలన మానుఁడు వారు మీ కలిమి తృణము
లీలఁ బోలింప లేమి మృణాళగుణము
ఘూరిమదవారణములకు వారణంబె.

తా॥ ఓయీ! యథార్థ మెరిగిన పండితుల నవమానింపకుము. నీ సంపదను చూచి నీ మాటల భరింతురని తలచెదవేమొకాని వారు నీ సంపదను గడ్డిపోచవలె చూతురు. నూతనముగ మదధారకారుటచేత నలుపెక్కిన చెక్కిళ్లు గల మదగజంబుల తామరతూటిచేత గట్టివేయుట సాధ్యమగునా?

Trying to tie a rut elephant with lotus string is equal to that of insulting the scholorly person by a wealthy man. The wealth for the scholorly person is equal to a hay. They will treat the richness as a wretched one.

చ. వనజభవుండు కోపమున వాహనమైన మరాళభర్తకున్
వనజవనీ విహారకలనంబు దొలంగఁగఁ జేయుగాని గుం
భనమున దుగ్ధజీవన విభాగ విధాన నిరూఢనైపుణీ
జనిత మహాయశో విభవసారము హంసకు మాన్పఁ జాలునే.

తా॥ బ్రహ్మకు హంసమీద కోపము వచ్చునేని పద్మ సరోవరములందు విహరింపకుండునటుల చేయగలడుగాని నీరక్షీరంబుల వేరుపరుచుట యందుగల నేర్పును తీసివేయజాలడు గదా?

The creator of Universe (Brahma) can order his swan (his vehicle) not to enter his Padma Sarovara but he cannot stop the natural gift of swan. can? Separating water from milk (i.e. diluted milk)

ఉ. భూషలు గావు మర్త్యులకు భూరిమయాంగద తారహారముల్
భూషిత కేశపాశ మృదు పుష్ప సుగంధ జలాభిషేకముల్
భూషలుగావు పూరుషునిభూషితుఁ జేయుఁ బవిత్ర వాణి వా
గ్భూషణమే సుభూషణము భూషణముల్ నశియించునన్నియున్

తా॥ పురుషునకు భుజ కీర్తులు, సూర్య హారములు, చంద్ర హారములు, మొదలగు సొమ్ములుగాని, స్నానము, చందనము పూసికొనుట, పూలు ముడుచుకొనుట, కురులు దువ్వుకొనుట మొదలగువానిలో నేదియుగాని యలంకారము నియ్యజాలదు. శాస్త్ర సంస్కారముగల వాక్కు ఒకటియే అలంకారమును కలుగజేయును. సువర్ణమయాదిభూషణములన్నియు నశించును. వాగ్భూషణ మొక్కటియే నశింపని భూషణము.

The real ornament for everybody is gnyana, and sweet talks only, but not the sandle wood scent, Bracelet, Neckles, Flowers. These things are only for body and are mortal. The real ornaments are knowledge and wisdom which are immortal.

ఉ. విద్య నిగూఢగుప్తమగు విత్తము రూపము పూరుషాళికిన్
విద్య యశస్సు భోగకరి విద్య గురుండు విదేశబంధుండున్
విద్య విశిష్ట దైవతము విద్యకు సాటి ధనంబు లే దిలన్
విద్య నృపాల పూజితము విద్య నెరుంగనివాడు మర్త్యుండే.

తా॥ పురుషునకు విద్యయే రూపము. విద్యయే రహస్యముగ దాచిపెట్టబడిన ధనము. విద్యయే సకల భోగములను, కీర్తిని, సుఖమును కలుగజేయును. విద్యయే గురువువలె అన్నియు బోధించును. పరదేశమునందు జుట్టమువలె సహాయ మొనర్చును. విద్యయే పరమాత్మ. విద్యయే రాజపూజితము. ధనమిట్టిది కాదు. ఇట్టి విద్యలేనివాడు పశుతుల్యుడు.

Education gives us charming (Tejam). It is a teacher, guide, philosopher and bread giver even in foreign place. It is Godly. It is a hidden treasure. It will be renowned by kings. So education is everything unlike money which has got the nature of frailty. Hence uneducated man can rightly be said as 'a beast'.

(17)

చ. క్షమ కవచంబు క్రోధమది శత్రువు జ్ఞాతి హుతాశనుండు మి
త్రము దగుమందు దుర్జనులు దారుణపన్నగముల్ సువిద్య వి
త్త ముచితలజ్జ భూషణ ముదాత్త కవిత్వము రాజ్య మీక్షమా
ప్రముఖ పదార్థముల్ గలుగు పట్టునఁ దక్కవచాదు లేటికిన్.

తా॥ ఓరుపున్న యెడల కవచము లక్కరలేదు. కోపమున్న యెడల (ఉపద్రవము గలుగజేయుటకు) శత్రువు లక్కరలేదు. దాయాది యున్న యెడల వేరెనిప్పు అక్కరలేదు. మిత్ర ముండెనేని సిద్ధౌషధము లక్కరలేదు. దుర్జను లుండిరేని సర్పములక్కరలేదు.

Patience needs no armour. Illtemper needs no enemies. Kinmen needs no fire. Good friendship needs no medicine. An elixer (wickedman) needs no snakes.

చ. పరకృప భృత్యులందు నిజసర్గమునం దనుకూలవృత్తి కా
పురుషులయందు శాఠ్యము సుబుద్ధులయం దనురక్తి దాల్మి స
ద్గురువులయందు గౌరవము కోవిదులందు నయంబు రాజులం
దరిజనులందు శౌర్యము మృగాక్షులయందుఁ బ్రగల్భభావ మీ
వరుసఁ గళా ప్రవీణులగు వారలయందు వసించు లోకముల్.

తా॥ బంధువులయందు దాక్షిణ్యముతోనుండుటయు (దాక్షిణ్యమనగా వారి యిష్టానుసారము నడచుట), సేవకులయందు దయ, దుర్జనులయందు కఠినముగ నుండుట, సజ్జనులయందు ప్రీతియు, రాజులయందు అనుసరణమును, విద్వాంసులయందు గ్రమ ప్రవర్తనమును, శత్రువులయందు బరాక్రమమును, పెద్దలయందు ఓర్పును, స్త్రీలయందు దిట్టతనమును ఏ పురుషులు గనబరతురో అట్టివారలే లోక స్థితికి గారణభూతులు.

The perfect man should be considerable towards relations, sympathetic on employees, rigorous on wicked people, affectionative on good people,. submissive towards rulers, respecting scholors, fierceness on enemies, patience towards elders and firmness towards women.

తే. సత్యసూక్తి ఘటించు ధీ జడిమ మాన్పు
గౌరవ మొసంగు జనులకుఁ గలుష మడఁచుఁ
గీర్తిఁ బ్రకటించు చిత్త విస్ఫూర్తిఁ జేయు
సాధుసంగంబు సకలార్థ సాధనంబు

తా॥ సత్సాహవాసము బుద్ధిమాంద్యమును బోగొట్టును. సత్య వాక్యములనే పలుకజేయును. మంచి గౌరవమునిచ్చును. పాపముల బోగొట్టును. మనస్సు బాగుచేయును. దిక్కులయందు గీర్తిని వ్యాపింపజేయును. వే యేల ? అది చేయజాలని మంచి యే లోకమునను లేదు.

The friendship with good natured people will gives us, true knowledge, habit of speaking truth, respect in society, free from sins, and reputation all over the world.

క. సుకృతాత్ములు రససిద్ధులు
సుకవీంద్రులు విజయ నిధులు సుమ్ము తదీయా
ధికకీర్తి శరీరంబులు
ప్రకట జరామరణ జన్మ భయరహితంబుల్

తా॥ తత్త్రరసానుగుణముగ వర్ణించు నైపుణ్యముండుట చేత ధన్యాత్ములగు కవీశ్వరులు జరామరణములు లేని తమకీర్తి శరీరముల చేత సిద్ధౌషధసేవచే జరామరణముల నతిక్రమించిన యోగులవలె సర్వదా ప్రకాశించుచుందురు.

The sacred people and scholars will be immortal sacred by virtue and scholar by his scholarly (true knowledge) deeds.

ఉ. గ్రాసము లేక స్రుక్కిన జరాకృశ మైన విశీర్ణ మైన సా
యాసము నైన నష్టరుచి యైనను బ్రాణ భయార్తమైన ని
స్త్రాసమదేభకుంభపిశి తగ్రహలాలన శీల సాగ్రహో
గ్రేసర భాసమాన మగు కేసరి జీర్ణతృణంబు మేయునే?

తా॥ శూరాగ్రణియగు సింగము ఆకలిచే డస్సినను, ముదిమిచే జిక్కినను, కష్టస్థితిని బొందినను, కాంతి విహీన మయినను, ప్రాణములు పోవుచున్నను మదించిన ఏనుగు యొక్క కుంభస్థలమును పగులగొట్టి యందలి మాంసమును భుజింపదల చునే కాని ఎండుగడ్డిని తినునాయేమి?

The Lion (King of forest) prefers starvation but will not eat grass to satisfy his hunger. He prefers to eat the frontalglobe on the forehead of an elephant only.

(22)

ఉ. స్నాయువ సావసేకమలి నమ్మగునెమ్ము గ్రహించి జాగిలం
బాయత మోదమందుఁ జనదాకలి దానికిఁ జెంత నున్నగో
మాయువుదానిఁ జూచి పరిమార్చక సింగము దంతిఁ గూల్చు నే
చాయల నెల్లవారు నిజసత్త్వ సమానఫలార్థులేకదా.

తా॥ కుక్క మాంసహీనమై సన్నని నరములు క్రొవ్వు స్వల్పముగనుండిన మలినమైన యెముక దొరికినంతనే సంతోషము నొందునుగాని అయ్యది దానియాకలిని దీర్పదు. సింగము తన యెదుట జంబుకలులు చరించు చుండినను వానిని వదలి వనంబంతయు గ్రుమ్మరి గజరాజమును చంపును. కావున జనులు కష్టకాలమునందును తమ శక్తికి దగిన లాభమునే కోరుదురుగాని ఎచ్చు తక్కువలుగ గోరరు.

According to the need and habits, people will prefer to get their things (profits) like the dog and the lion. Dog will eat the perishable bone without adequate mutton on it which will not satisfy hunger. The lion will not (hunt) eat though the jackal is readily available. He goes on searching for an elephant for his food.

(23)

ఉ. వాలము ద్రిప్పు నేలఁబడి వక్త్రముఁ గుక్షియుఁ జూపు గ్రిందటం
గాలిడుఁ ద్రవ్వఁ బిండదునికట్టెదుటన్ శునకంబు భద్రశుం
డాలము శాలితండులగు డంబులు చాటు వచశ్శతంబుచే
నోలి భుజించు ధైర్యగుణ యుక్తిగఁ జూచు మహోన్నత స్థితిన్.

తా॥ కుక్క తనకు పిడికెడు నన్నము పెట్టువాని యెదుట తోక నాడించుట కాలితోనే భూమియందు బడి నోరు కడుపు జూపించుట మొదలగు నీచ కృత్యములెన్నియో చేయును. గజశ్రేష్ఠము ధైర్యముతో జూచుచు మావటి వానిచేత ప్రియావాక్యములచేత లాలింపబడుచు నాహారమును గ్రహించును.

The elephant will always be elegant and gets its food from mahout who gives good food with affection unlike the dog. The dog will show his temporary gratitude by weaving his tail and will show some cheep tricks, to get his food out of mercy from his master.

తే. ప్రాణిలోకంబు సంసార పతిత మగుట
వసుధపైఁ గిట్టి పుట్టని వాడు గలడె
వాని జన్మంబు సఫల మెవ్వానివలన
వంశమధికోన్నతి వహించి వన్నెకెక్కు.

తా॥ చావు పుట్టుక లనునవి యెప్పుడునుగల యీసంసార చక్రమునఁ జచ్చిన వారందరును బుట్టువారే. అట్లు పుట్టినవారిలో నశింపని వా రెవరు? ఎవని పుట్టుకవలన వంశము కీర్త్యాదులచేత వాసిగాంచునో వాడే జన్మించినవాడు. వాని జన్మయే గణనీయము.

Death always follows birth. Birth is mortal. The good deeds and fame only can make the birth immortal. That birth claims real value Rest births are useless.

తే. కుసుమ గుచ్ఛంబునకుఁ బోలెఁ బొసగు శౌర్య
మానవంతున కివి రెండు మహితగతులు
సకల జనమస్తక ప్రదేశముల నైన
వనమునం దైన జీర్ణ భావంబుఁ గనుట.

తా॥ మహనీయుడగు విద్వాంసునకు పుష్పగుచ్ఛమునకు బోలె ఎల్లరచేత శిరసావహింపబడుటయో, లేక అరణ్యముననే క్రుగ్గుటయో ఈ రెండు గతులే తక్క వేఱు విధము లేదు.

Flowers and great scholors will opt two ways only. Flowers either will be garlanded or will be aloof in the forest. So also great scholors either will be renowned or will be away from people.

మ. గురుముఖ్యుల్ గలరేవు రాఱురు శుభాంగుల్ ఖేచరుల్ వారిలో
వరవిక్రాంతవిహారి రాహు వెప్పుడున్ వైరంబు సేయందు భా
స్వరులన్ భాస్కరయామినీచరులనే బాధించుచున్నాడు ద
త్వరతన్ మస్తక శేషమూర్తి యగునా దైత్యుండు గర్వంబునన్.

తా॥ బృహస్పతి మొదలగు గణనీయములైన అయిదారు గ్రహములు న్నను పరాక్రమశీలుడగు రాహువు వారి తెరువుబోక శీర్షావశిష్టుడై యుండియు తేజోవంతులగు దివాకరనిశాకరు (సూర్యచంద్రు)లను మాత్రమే పర్వకాలములందు పీడించుచున్నాడు.

Rahuvu even though he got head only had won and teases forever, the Sun, the brightest plannet, the Moon (the king of the night) Rahuvu did not fight with Bruhaspathy and five other brave plannets.

(27)

మ. భువనశ్రేణి వహించు శేషుఁడు ఫణాభోగంబుపై సంతతం
బవలీలన్ ధరియించుఁ బృష్ఠమునఁ గూర్మాధీశ్వరుం డాతనిన్
ధవళక్రోడవశాత్ముఁ జేయునతనిన్ వారాశి యశ్రాంతిచే
నవురా! ధీరచరిత్ర సంపద లసంఖ్యాత ప్రభావోన్నతుల్.

తా॥ ఆదిశేషుడు పదునాలుగు లోకములను తన పడగలచేత మోయుచున్నాడు. అతనిని ఆదికూర్మమూర్తి మూపున వహించుచున్నాడు. ప్రళయకాల సముద్రు డట్టి యాది కూర్మమును ఆదివరాహానికి లోబడినవానినిగా జేయుచున్నాడు. కావున మహాత్ముల మహిమకు మేర లేదు.

The old dragon (Adi Seshu) carries the Earth. He has been supported by a turtle (Adi Kurma) The Ocean made the turtle submissive to the boar (Adivaraha) the third incarnation of 'Vishnu', So great people can do unmatchable miracles.

(28)

చ. సమధిక భీషణ జ్వలన జాల వినిర్గమ దుస్సహంబుచే
సమద సురేంద్రముక్త కులిశక్షతిచే నుచితంబు ప్రాణఘా
తము హిమవత్కుమారునకుఁ దండ్రి నిశాత శతారపాతఖే
దమున మునుంగుచున్నతఱిఁ దా జలరాశిఁ జొరంగ నర్హమే.

తా॥ హిమవంతుని కుమారుడగు మైనాకునికి, దేవేంద్రుడు తన బలిమికొలది వేయ నిప్పులు గ్రక్కుచు నోర్వరాక మీదబడు కులిశము యొక్క ధారాహతిచే జచ్చుటే కొంచెము మంచిది గాని, ఆ పాటుచే మూర్ఛ నొందిన తన తండ్రిని వదలి తన ప్రాణములను రక్షించుకొన సముద్రము జొచ్చి దాగియుండుట తగునా?

Minaka the son of Himavantha had hidden himself in the ocean (leaving his old father for his fate) to save his own life from Indra who had used Vajrayudha (Kulisa) against Minaka. Was it fair on his part?

తే. అర్కకాంత మచేతనం బయ్యు సవితృ
పాదములు సోకినంతనె ప్రజ్వరిల్లుc
గాన నభిమానవంతుc డెందైన శత్రు
కృత తిరస్కార మెట్లు సహింపనేర్చు.

తా॥ సూర్యకాంతమణి అచేతన మయినను సూర్యుని పాదములు (కిరణములు) తనకు సోకినంత మాత్రనే మం(డిప)డును. కావున తేజోవంతులు పరులు చేయు పరిభవమును సహించి యూరకుండరు.

Dumani (Sun's diamond) seems to be dull but when it receives the Sun's rays it shines again. So also the well versed persons may be insulted by others, there won't any impact on them. That will only a momentary effect. Again they will shine like Dumani.

(30)

క. విదలింప నుఱుకు సింగపుఁ
గొదమయు మదమలినగండ కుంజరములపై
నిది బలశాలికి నెజము
గద తేజోనిధికి వయసు కారణమగునే.

తా॥ సింగము బాల్య దశయందుండినను మదధారలు స్రవించుటచే మలినము లయిన గోడలవంటి చెక్కిళ్ళు గల మదగజంబుల మీద కురుకును. ఇది బలవంతుల స్వభావము. పరాక్రమ ప్రకటనమునకు వయసు మొదలగునవి పనిలేదు.

The cub or puff though is young will not keep quite. He will sprang upon the mighty elephant and will kill. For brave deeds the age is not a hindrance.

ఉ. జాతి దొలంగుఁ గాత గుణశక్తి రసాతల సీమకుం జనుం
గాత కులంబు బూది యగుఁ గాత నగంబున నుండి శీలముం
బాతము జెందుఁ గాత బహు భంగుల విత్తమె మాకు మేలు వి
ఖ్యాత గుణంబు లెల్లఁ దృణ కల్పము లొక్కధనంబు లేవడిన్.

తా॥ జాతి పాతాళమునకు బోయినను, సద్గుణము లంత కంటె గ్రిందుపడినను, శీలము కొండమీదనుండి క్రిందపడినను, వంశము తగలబడినను, శౌర్యమునందు బిడిగుపడినను మాకేమియు లోపము లేదు మాకు ద్రవ్యమొక్కటి యున్న జాలును. ఈ ద్రవ్యములేక పోవునేని పైన చెప్పినవి యుండియు గడ్డిపోచకైనను కొఱగావు.

Let the caste go to hell, good qualities may diminish, let the family may go to dogs. Bravery may lost its nature. Nothing has lost, if money is there, everything is there. So money rules evertything (Money makes many things)

క. ఏ నరునకు విత్తముగల,
దానరుడు కులీనుఁ డధికుడార్యుడతండే
ధీనిధి ధన్యుడు నేర్పరి,
నానా గుణగణము కాంచనంబున నిలుచున్.

తా॥ లోకమునందు ధనము గలవాడే కులీనుడనియు, పండితుడనియు, శాస్త్రజ్ఞుడనియు, గుణావగుణముల నెఱింగిన వాడనియు, చక్కని వాగ్ధోరణి కలవాడనియు, చూడదగినవాడనియు, రూపవంతుడనియు జెప్పబడును. ధనమొకటి ఉండునేని పై గుణములు లేకపోయినను వాని యం దీగుణము లున్నవని జనులు తలంతురు.

If money is there, everything is there. The wealthy man will be treated as a man of letters, as a scholor, as a good qualitative person, as a good orator and as a handsome person, though he has no above qualities.

మ. యతి సంగంబున బాలు డాదరముచే జ్యాభర్త దుర్మంత్రిచే
శ్రుతిహానిన్ ద్విజు డన్వయంబు ఖలుచేం గ్రూరాప్తిచే శీల ము
ద్ధతిచే మిత్రత చూపులేమిం గృషి మద్యప్రాప్తిచే సిగ్గు దు
ర్మతిచే సంపదలున్ నశించుం జెడు నర్థంబుల్ ప్రమాదంబునన్.

తా॥ దుర్మంత్రి వలన రాజును, సంగము వలన యతియు, లాలించుటచే బుత్రుడును, వేదాధ్యయనము లేమిచేత బ్రాహ్మణుడును, కుపుత్రుని వలన వంశమును, దుర్మార్గుల సేవ వలన సదాచారమును, మద్యపానము వలన లజ్జయు, తరచుగ జూడకపోవుటచేత వ్యవసాయమును, దేశాంతర సంచారముచేత స్నేహమును, అనురాగము లేమిచేత మైత్రియు, నీతి లేమిచేత సంపదయు, అపాత్ర దానముచేతను, పరాకుచేతను ధనమును నశించును.

The following misdeeds will result in vanishing of welth. For the king the ill advises of the crooked ministers, brahmin due to lack of knowledge in sacred hymns, Yati by his illegal contacts, the son by fondling of parents, modesty by drinking alcohol, improper attention on agriculture, lack of intimacy with the friends, friendship without any affection, immorality, gift to undeserving and carelessness.

(34)

క. దానము భోగము నాశము
పూనికతో మూడుగతులు భువి ధనమునకున్
దానము భోగము నెఱుగని
దీనుని ధనమునకు గతి దృతీయమె పొసగున్.

తా॥ ధన వ్యయమునకు సత్పాత్రదానము, తా ననుభవించుట, దొంగలు మొదలగువారలు హరించుట అని మూడు దారులు గనబడుచున్నవి. ఎవడు సత్పాత్రమున కియ్యక తాను ననుభవింపక యుండునో వాని ధనమునకు మూడవ దారియే (అనగా చోరులు మొదలగువారు హరించుటయే) అగును.

One should spend his money by donating to needy deserving, spending money for one self. If he will not do the above, the money will be lost by theft. So one should do donations and spend for one - self.

(35)

ఉ.శాణ విఘృష్ట రత్నమును శస్త్రహతుం డగు శూరుడున్ మద
క్షీణగజంబు సైకత విశిష్ట శరన్నదియున్ నవక్షపా
ప్రాణ విభుండు చండసుర తాలన బాలికయున్ ధనై కవి
శ్రాణ నశూరులుం గడుc గృ శత్వమునం బ్రభc గాంతు రిద్దరన్.

తా॥ సానబెట్టబడిన మణియు, ఆయుధ క్షతములు గలిగియున్న శూరుడును, మదజల స్రావముచేత జిక్కిన గజమును ; శరత్కాలమున ఎండిన యిసుక తిన్నెలు గల నదియు, కలామాత్రావశిష్టుడగు చంద్రుడును, రతిక్రీడచే డస్సిన నవయౌవన యగుబాలయు సత్పాత్రదానముచేత నైశ్వర్యమును గోలుపోయిన రాజులును ఎంత కృశించినను విశేషముగ బ్రకాశింతురు.

The following will never loose their virtue. Their lost shine is momentary. Shining, vigour, bravery, stamina will not go-off permanently. Such as the gem in process, a wounded soldier in battle, an elephant that has been attacked by the wild sea creatures, the river that has no water during autumn, a tired blonde after copulation and the king after giving donation to the deserving needy.

ఉ. చేరి యొకండు నెవ్వబడి చిక్కుచు జేరెడు శాలి ధాన్యమే
కోరు నతండు పిమ్మట నకుంఠధనోన్నతుడై వసుంధరం
బూరికి సాటిగాc దలచు భూరి ధనాఢ్యులచొ ప్పనేకమై
గౌరవమున్ లఘుత్వమును గైకొను వస్తువులందు నెల్లెడన్.

తా॥ దారిద్ర్యము ననుభవించునప్పుడొక గుప్పెడు ధాన్యము నపేక్షించునతడే కాలాంతరమున ఐశ్వర్యము నందునేని భూమండలము నంతయు గడ్డిపరకవలెc గాంచును. కాబట్టి సమయము ననుసరించి వస్తువులు అధికములనియు నల్పములనియు జెప్పబడును. ఒకప్పుడు అల్పమైనద్ది మరొకప్పుడధికముగను, అదియే మరల నల్పమైనది గను తోచును.

If a poor man becomes upstart, he feels that the entire world is as a hay. So the things and status will change according to the situation. The mighty things may appear as small ones and the small ones may appear as mighty ones.

(37)

తే. ధరణి ధేనువు పిదుకంగఁ దలచితేని
జనులఁ బోషింపు మధిప వత్సముల మాడ్కి
జనులు పోషింపబడుచుండ జగతి కల్ప
లత తెఱంగున సకలఫలంబు లొసగు.

తా॥ రాజా! భూమి యను గోవు నుండి ధనమును పితుక దలచితివేని ఆవుదూడను పోషించిన విధంబుగ జనుల బోషింపుము. ఆ జనుల జక్కగ నీవు పోషించితివేని భూమి కల్పవల్లి వలె గోరినవాని నన్నింటిని ఫలింపజేయును.

Oh King! the Earth and cow are equal. To get milk from cow, you should feed calf carefully. Like that, if you wish to get money you should take care of your subjects, then only the Earth will be your wishing tree (Kalpa taruvu)

తే. సత్య మనృతంబు పరుషోక్తి సరస భాష
ప్రాణి హింసయు దయయు లోభంబు నీగి
కనక సంగ్రహ వ్యయములు గలుగు వార
రమణికైవడి బహురీతి రాజనీతి.

తా॥ రాజనీతి కొన్ని తావుల సమయోచితముగ సత్య మిశ్రముగను, కొన్ని తావుల నసత్యయుతముగను, ఒకచోట నిష్ఠురముగను, ఒక తావున చెవుల కింపుగను నుండుచు, ఒకచోట బాధించుచు, మరొక తావున దయను గనంబరుచుచు, ఒక తావున పిసిడితనము నొందుచు, మరొక చోట దానము నొనర్చుచు, నొకచోట నెప్పుడు వ్యయపెట్టుచు మరొక విధముగ నెల్లప్పుడు సంపాదించుచు, వారాంగనవలె నానాప్రకారముల నుండును.

The politics can be compared with a prostitute. The politics are of the same nature, it mixes with truth, lies, fine tune, harshly, miserly, liberally and with mixed economy.

తే. ఆజ్ఞయును గీర్తియును భూసురావనంబు
దానమును భోగ మిత్ర సంత్రాణనములు
షడ్గుణంబులు గలుగవే జనులయందు
వారిం గొల్చిన ఫలమేమి వసుమతీశ.

తా॥ దుర్జన శిక్షణము, సత్కీర్తి బ్రాహ్మణ పరిపాలనము, సత్పాత్రదానము, స్రక్చందన విహారాది భోగములు, ఆపన్నులగు మిత్రాదుల రక్షించుట అను సద్గుణ షట్కము లేని రాజుల సేవించుట వలన లాభమేమియు లేదు.

Don't serve the king (Boss) who has not got the following desirous qualities. Punishing of an evil or wicked person, lack of glory, without brahmins in his court, not donating to deserving needy, not enjoying his life in a proper manner, not caring his own kinsmen.

చ. వనజ భవుండు నెన్నొసట వ్రాసిన సొమ్ము ఘనంబొ కొంచెమో
విను మరుభూమి కేగిన లభించును మేరువుఁ జేరఁ బోయినన్
ధన మధికంబు రాదు కడుదైన్యము మాను ధనాఢ్యులందు న
వ్వన నిధి నూతఁ దుల్యముగ వారి గ్రహించు ఘటంబు సూమతీ.

తా॥ తన నొసట వ్రాసినంత ధనము కొద్దియైనను గొప్పదైనను మరు స్థలము నం దున్నను తప్పక పొందును. మేరువు నెక్కినను అంతకంటె నధికముగ బొందదు. కావున ధనవంతులయెడ నీ దీనత్వమును గనంబరుపకుము. కుండను బావియందు ముంచినను సముద్రమున ముంచినను దాని పరిమితమైన జలము మాత్రమే గైకొనునుగదా. ఈ దృష్టాంతముగ నెచటికి బోయినను నొసటివ్రాత యంతే లభించును గాని యెక్కువ గలుగదు. కలిగినంత మాత్రమున తృప్తి పొందియుండవలెను.

A man that had a pot will get a pot of water only even if he goes to a well or a sea. Like that, according to his fate, one will get one's fortune though he happened to be in the grave yard or desert. Even if he goes to golden mountain (Meru parvatam) he will not get more than what he deserves to get. He should be (Complaisant).

(41)

తే. కారణము లేని కలహంబు గరుణలేమి
పరవధూపరధన వాంఛ బంధు సాధు
జనములం దసహిష్ణుత్వ మనగ జగతిం
బ్రకృతి సిద్ధంబు లివి దుష్టనికరమునకు.

తా॥ దయాహీనత, నిష్కారణమైన కలహము, పరుల ధనమునందును పరస్త్రీల యందును ఆసక్తి, సజ్జనులయందును, బంధువులయందును ఓర్పులేమియు ఇవి దుర్జనుల స్వభావ సిద్ధగుణములు.

The man who quarrels without causes, expects wealth from others, wicked eye on the women, impatient towards kins and good people, is said to be a wicked man.

తే. విద్యచే భూషితుండయి వెలియుచున్నఁ
దొడరి వర్జింపనగుఁ జుమీ దుర్జనుండు
చారు మాణిక్య భూషిత శస్తమస్త
కంబు గలపన్నగము భయంకరము గాదె.

తా॥ పాము శిరమునందు రత్నము కలదైనను భయంకరమగుటచేత దూరముగ నెటులు వదలదగిన దగుచున్నదో, అట్లే దుర్జనుడును విద్యావంతుడైనను దూరముగ విడువ దగినవాడు.

The Cobra and wicked Scholor, are equaL Though the cobra pocess a gem on her head no body will venture to go near-by. Eventhough he is a scholor, because of his cruel nature no body approaches him, for learning.

(43)

శా. హ్రీరమ్యుం జడుగాగ సువ్రతుని మాయింగా, శుచిం దంభిగా
శూరున్ నిర్దయుగా, మునిన్ విమతిగా శ్రోత్రప్రియాలాపు ని
ష్ఠ్యూరుంగా, బలవంతు గర్వితునిగా, సద్వక్త వాచాలుగా,
గ్రూరుం డెన్ని సుధీగుణంబు దురితారూఢంబు జేయుం గదా!

తా॥ లజ్జగలవాని మందునిగను, తపోవంతుని డంబముగలవానిగను, శుచిగలవానిని వేషధారినిగను, శూరుని దయాహీనునిగను చెప్పును. ఆత్మస్వరూపమును మననముచేయు వానిని బుద్ధిహీనుడని దూషించును. ప్రియముగ మాటలాడువానిని చూచి దీనుడుగా గణించును. తేజోవంతుని గర్విగా ప్రకటించును. సభలలో జక్కగ యుక్తియుక్తముగ మాటలాడువానిని వదరుబోతుగా నెంచును. ఇట్లు గుణవంతుల గుణములలో దుర్జనులు దోషముగా గణింపని దేదియు లేదు.

The wicked always finds faults with good people. If a man is with bashfulness they will treat him as a fool of an ass. A sage will be treated as a proud one. An Orthodex will be treated. as an actor, brave man as merciless, believer of the Karma will be treated as stupid. Pleasing talker will be treated as a poor man. A brilliant man as a humiliator, a clever talker as a bore. For a wicked person, all the good qualities will seem to be bad ones.

చ. వగ గొనులోభముం బిశున భావము సత్యము చిత్తశుద్ధియుం
దగు సుజనత్వమున్ సుమహితత్వము విద్యయు లోకనిందయుం
దగిలిన, దుర్గుణంబు దురితంబు దపంబును దీర్థసేవ భృ
త్యగణము సొమ్ములుం ధన చయంబును జావురు వేఱ యున్నావే?

తా॥ అత్యాశ యున్న అది యొక్కటియే యత్యధిక నిందను కలుగజేయును. అందుకు వేరొక దుర్గుణ మక్కరలేదు. పిశునత్వము (కొండములు చెప్పుట) ఉండునేని నరకములో ద్రోయుటకు వేరు పాపములక్కరలేదు. సత్యమున్న లేక, సర్వజనులను సమముగా జూచు గుణమున్న, ఆ గుణ మొక్కటియే పాపముల బోగొట్ట జాలియుండ చాంద్రాయణాది తపస్సు చేయనక్కరలేదు. ద్రోహచింత మొదలగు దుష్టసంకల్పములేక నిర్మలమగు మనస్సున్న మోక్షదాయక మైన తీర్థసేవ యక్కరలేదు. మంచితనముండెనేని స్వకార్యనిర్వహణ మునకు స్వజన మక్కరలేదు. గౌరవముండునేని యలంకారములక్కర లేదు. చక్కని విద్యయుండునేని వేరు ధనమక్కరలేదు. అపకీర్తి యుండునేని అది యొక్కటియే మృతప్రాయము గనుక వేరుగ చావనక్కరలేదు. కావున పై విషయముల నన్నిటిని చక్కగ నాలోచించి దుర్గుణములు త్యజించి సుగుణములు గ్రహింపవలయునని భావము.

One should be very careful in choosing the things like good and bad. Bad things such as a greediness which gives bad name, tale carrying which will have its own bad reprecations, no hells punishment is needed. Bad name is equal to death. Good ones such as speaking truth, giving equal importance to every being, will sweeps away all the sins and is equal to Chandrayana Vratha (Means : A religious or expiatiory observance regulated by the moon's age) Pious mind is equal to piligrammage. No henchman is needed to do any work. The good deed will do all that is needed. Respect is equal to an ornament. So man should be careful in doing things and should do good things only.

చ. దినమలి నాంగుడైన హిమ దీప్తియు, బ్రాయము దప్పునాతియున్,
వనరుహశూన్య మౌకొలను, వర్ధితరూపు నిరక్ష రాస్యమున్,
ధనపరుడైన రాజు సతతంబును లేమిని గుందుసాధువున్,
జనపతి చెంత దుర్జనుడు, శల్యము లే డివి నామనంబునన్.

తా॥ పగటియందు దేజోహీనుడైన చంద్రుడును, గత యౌవనయగు కామినియు, తామరలు లేని కొలనును, చదువు లేని సుందరుడును, కేవల ధనాశగల భూపాలుడును, సర్వదా దరిద్రుడగు సజ్జనుడును, ప్రభువుల సమీపమున జేరి యితరుల కార్యవిఘాతము చేయుచుండు దుర్జనుడును ఈ యేడుగురును శల్యమువలె మనస్సునకు దుఃఖమును కలుగజేయుదురని యభిప్రాయము.

Shiningless Moon in the day time, an aged prostitute a lake without lotus, uneducated handsome, a king that wants to acquire money by hook or crook, a sage with poverty, a cruel man who carries tales to the king, all these seven people are to be shunned because they are the causers of mental agony.

క. మనుజులలో నెవ్వడు దగ
దనవాడనువాడు దుష్ట ధరణీశునకున్ ?
దనకయి వ్రేలిమి వ్రేల్చెడు
జనునితనువుఁ గాల్చు వాయు సఖు డదయుండై.

తా॥ అగ్నిహోత్రుడు తనతృప్తికై ఆజ్యాదులు హోమము చేయువానిని సైతము తాకినంతమాత్రాన మొగమోటమి లేక కాల్చును. అట్లే అతి కోపులగు భూపాలురకును స్థిరముగ ప్రేమించదగినవాడు ఒకడును నుండడు. వారెంతటి హితకారినైనను ఇంచుక తప్పిన చంపింతురు.

The king will not hesitate to kill a person though he is honest because of the politics, as the fire that eats ghee and the man also, if he is not attentive.

ఉ. మౌనము చేత మూగయు, సముచితవక్త ప్రలాపి, చెంగటం
బూని వసింప దిట్ట, దమముందట దవ్వుగ నుండెనేని శా
లీనుడు, దాల్మి భీరు, c డవలిప్పుడు దాలిమి లేని బంటు, భూ
జానులసేవ దుష్కర మసాధ్యము యోగులకైన నిద్దరన్.

తా॥ సేవకుడగువాడు ఏమియు బలుకక యుండునేని వానిని మూగవాడనియు, చక్కగ మాటాడునేని వదరుపోతనియు, సమీపమున నున్న భయభక్తులు లేనివాడనియు, దూరముగ నున్న చేతకాని వాడనియు, సహించువాడగునేని పిరికియనియు, ఓర్పులేనియెడల సద్వంశజాతుడు కా డనియు ప్రభువులు తలతురు. కావున ఇట్టి సేవాధర్మమునందు చక్కగ జరించుట యోగీశ్వరులకైనను అలవి కాదు.

To satisfy a king is a difficult task by his subordinates. If he keeps silent he will be treated as a dumb person. If he talks he will be treated as a talkative. If he moves closely with the king he will be treated as a mannerless brute, if he keeps himself away from the king he will be treated as timid, if he rebels he will be called as impatient. So to be in good books with the king is a difficult one even to sages.

(48)

చ. ఖలు లగువారి నెల్ల నధికార సమర్థులఁ జేసి, తా నిర
ర్గళ గతియై, నికృష్ట నిజకర్మము విస్మృతి పాలొనర్చి, ని
శ్చల గుణవైరి యై, విధివశంబున సంపద గాంచి త్రుళ్లుచున్
మెలగు నృపాలుదేశమున మేలు లభించునె యెట్టివారికిన్ ?

తా॥ దుర్జనులకే సహాయమొనర్చుచు వారిని జేరదీసి స్వేచ్ఛా చారుడై తా నింతకు ముందనుభవించిన హీనస్థితిని దైవ యోగముచేత బట్టిన సంపద చేత పొగరెక్కి మరచి గుణవంతుల ద్వేషించు నీచుని కంటబడిన వా రెవ్వరును సుఖపడరు. అట్టివానికి గోచరింపక బ్రదుకుటయే క్షేమమని యుపదేశము.

The wicked man will never be happy though he is wealthy. The nature of his, is always to support his bad hunchmen and their bad deeds. He insults the good. So one should avoid such person, in order to live with harmony.

తే. మొదలం జూచిన గడు గొప్ప పిదపం గుఱుచ,
యాదిం గొంచెము తర్వాత నధిక మగుచుం,
దనరు, దినపూర్వ పరభాగ జనితమైన
చాయపోలికం గుజనసజ్జనుల మైత్రి.

తా॥ దురాత్ముల స్నేహము ప్రాతఃకాలపు నీడవలె ప్రథమమున విస్తారముగ నుండి క్రమక్రమముగ క్షీణించిపోవును. సజ్జనుల మైత్రి సాయంకాలపు నీడవలె ప్రథమమున చిన్నదై క్రమక్రమముగ వృద్ధినందుచు వచ్చును. కనుక నీ రెంటిలో నేది యుక్తమో దానిని బుద్ధిమంతుడు కైకొనవలెను.

The friendship of a bad man is like 'that of morning shadow, it increases rapidly and decreases slowly. But the friendship of a goodman grows slowly and remains stable. Though initially it appears small but it increases slowly as that of the shadow of evening. So one should opt the correct one, which is desirous.

(50)

తే. కసవుచే నీటిచే మోద కలనచేత
బ్రదుకు మృగమీన సజ్జన ప్రకరమునకు
శబరకై వర్తసూచక జనులు జగతిఁ
గారణము లేనిపగవారు గారె తలప.

తా॥ పరుల బీడింపకయే గడ్డిపరకల చేత కాలయాత్రను గడపుకొను జింకలు మొదలయిన మెకములకు బోయలును, నీటిచేత బ్రదుకు మీనములకు జాలర్లును, దొరికిన దానితో సంతసించి కాలయాత్ర చేయు సజ్జనులకు కొండెగాండ్రును అకారణవైరు లయి లోకమున గనంబడుచున్నారు.

In this world we can find people like, hunters, fishermen, tale bearers who will be the causers of unnecessary enimity. Fish lives in the water without doing any harm but the fisherman will haul and create unhappy moments to the fish. The hunter hunts the deer though it will not cause any harm and lives on grass. The tale bearers carry rumours and spoild the harmony of the society.

(51)

మ. సుకృతి శ్రేష్ఠుల గోష్ఠియుం బరగుణ స్తోమంబునం బ్రీతి, దే
శిక సంసేవయు, విద్యయందు రుచి, స్వస్త్రీకేళి, లోకాపవా
దకథా భీతియు, శంభుభక్తి, దమనోద్యచ్ఛక్తియున్, సాధుదూ
షక సాంగత్య విముక్తియుం, గలమనీషా వంతులం గొల్చెదన్.

తా॥ సత్సహ వాసమునందాసక్తియు, పరుల గుణమునందు బ్రీతియు, గురువులయందు అణకువయు, విద్యలయందాసక్తియు, స్వభార్య యందు సంభోగమును, జనాపవాదమునకు వెరచుటయు, ఈశ్వరుని యందు భక్తియు, అవమానము గలిగిన సామర్ధ్యమును చూపుటయు, దుస్సహవాసమును విడుచుటయు, ఇట్టి నిర్మల గుణములు గలవానికి నమస్కారము.

My adores (Namaskarams) to the pure, and pious hearted people who appreciate the good qualities in others, such as, good friendship, appreciatable nature in others, regard towards teachers, interest in education, to have copulation with his own wife only (Ekapatni Vratam), fear about rumours, God fearness, non-caring of insults and away from bad friendship.

ఉ. ఆపదలందు ధైర్యగుణ, మంచిత సంపదలందుఁ దాల్మియున్,
భూపసభాంతరాళమునఁ బుష్కల వాక్చతురత్వ, మాజి బా
హాపటుశక్తియున్, యశమునం దనురక్తియు, విద్యయందు వాం
ఛాపరివృద్ధియున్, ప్రకృతి సిద్ధగుణంబులు సజ్జనాళికిన్.

తా॥ ఆపదలు వచ్చినప్పుడు ధైర్యము, ఐశ్వర్యము వచ్చినపుడు ఓర్పు, సభయందు వాక్పాటవము, యుద్ధమునందు శౌర్యము చూపుట, కీర్తియందాసక్తి వేద శాస్త్రాభ్యాసమునందు చింత-ఇవి మహాత్ములకు స్వభావ గుణములు.

The qualities of an extraordinary person to be bold even in calamities, patience during richness, good oration, couragious during war, love towards fame, love towards Vedas and ethical sciences.

చ. కరమున నిత్యదానము, ముఖంబున సూనృతవాణి, యాదలం
గురుచరణాభివాదన, మకుంఠిత వీర్యము దోర్యుగంబునన్,
వరహృదయంబునన్ విశదవర్తన, మంచిత విద్య వీనులన్
సురుచిర భూషణంబు లివి శూరులకున్ సిరి లేని యప్పుడున్.

తా॥. మహాత్ములకు ఐశ్వర్యము లేమిచేత బంగారు సొమ్ములు లేకపోయినను ఈ క్రింద జెప్పబోవునవి స్వాభావికాలంకారములుగ గనబడుచున్నవి. ఎట్లన: హస్తములకు సత్పాత్రదానము, శిరమునకు గురుపాద నమస్కృతియు, ముఖమునకు సత్యవచనమును, భుజములకు జయస్వభావ మగుపరాక్రమమును, హృదయమునకు అకలంకమయిన ప్రవర్తనయు, చెవులకు శాస్త్రశ్రవణమును ఇవియు అలంకారములు.

Natural ornaments of any extraordinary persons are for hand bestoweth, for head paying regards to teachers, for face the truth, for shoulder the conquering of kingdom, for mind good behaviour, for ear to give heed to all the sciences.

మ. పరహింసాపరకీయ విత్తహరణా భావంబు సత్యవ్రతా
దరముం దానపరత్వ మన్యవనితో దంతోక్తి మూకత్వముం
బరతృష్ణా ఝర భంజనంబు గురు నమ్రత్వంబునుం బ్రాణభృ
- త్కరుణా శాస్త్రసమత్వ సద్విధులు భద్ర ప్రాప్తికిన్ మార్గముల్.

తా॥ జీవహింసను విడిచి పరుల ద్రవ్యమునందు మనసును బోనీక సత్యము పలుకుచు దేశకాలములెరిగి శక్తికొలది దానముచేయుచు బరస్త్రీల విషయమును గురించి ఏమియు బలుకక మౌనము వహించి అత్యాశను నిలిపి గురువుల యందు వినయమును గనంబరచుచు సకల ప్రాణులందు దయను చూపుచు సకల శాస్త్రములందు సమభావమున నుండుట అనునదియే సకల శ్రేయములను బొందుటకు మార్గము.

To claim the eaternal happiness one should follow the good methods. Avoid Jeevahimsa, snatching - nature of other's property, speaking truth, bestoweth to deserving, silent in other women's affairs, leaving greediness, regard towards teachers, to be mercyful, equal treatment in all sciences.

తే. సంపదలు గల్గుతఱి మహాజనుల హృదయ
మభినవోత్పల కోమలం బగుచు వెలయు;
నాపదలు వొందునపుడు మహామహీధ
రాశ్మ సంఘాత కర్కశం బై తనర్చు.

తా॥ మహాత్ముల మనస్సు సంపదలు సంభవించునేని కలువకంటె కోమలముగ నుండును. ఆపదలు వచ్చునేని పెద్ద కొండయందలి రాతిగుండువలె కఠినముగ నుండును. అనగా సంపదలు వచ్చిన గర్వించి కఠినులు కారనియు, ఆపదలు వచ్చిన వెలవెల బోరనియు భావము.

Extraordinary persons will never be proud and they are like white water lilly. The will never be worried even though they lost their property and they will remain stuburn as mountain.

మ. అసమాన ప్రియనీతివర్తనము, ప్రాణాంతంబునందున్ మలీ
మసమగ్రాహ్యా, మదుష్టయాచన, మసంమిత్రార్థనా భావమున్,
వ్యసనావాప్తిని ధైర్యముం, బుధ జనాత్యంతాను కూలత్వ, మీ
యసి ధారావ్రతచర్య యెవ్వడు మహార్యశ్రేణికిం దెల్పెనో!

తా॥ న్యాయమయిన వృత్తి నవలంబించుటయు, ప్రాణాపాయము సంభవించినను అకార్యము లొనర్పకుండుటయు, దుర్జనుల ప్రార్థింపకుండుటయు, ప్రాణ మిత్రుడైనను ధనహీనుడగునేని వానిని యాచింపకుండుటయు, ఆపదలయందు ధైర్యమును, మహాత్ముల కనుకూలముగ నడచుటయు అను ఈ యసిధారా వ్రతము సజ్జనులకు స్వభావముగ బట్టుపడినదిగాని ఒకరి యుపదేశబు చేత రా లేదు.

Extraordinary persons will always have certain good qualities. It is like walking on the sowrd. (Asidharavratham) They will never lie even at the time of life danger. Never approach a bad person for want of help. They will never knock the doors of others for want of financial help even from their friends during rainy days. They are obedient towards the scholors. These are the born gifts to the extraorainary persons.

మ. పాసగం దానము గుప్త, మర్థి భవనంబుం జేరుచో సంభ్రమో
ల్లసదుత్థాన విధానముం, బ్రియవిధుల్ గావించి మౌనంబు, రా
జసభన్ మిత్రకృతి ప్రకాశనముc, గుత్సాకర్మవైముఖ్య, మీ
యసిధారావ్రత చర్య యెవ్వడు మహార్యశ్రేణికిం దెల్పెనో!

తా॥ రహస్యముగ దానము చేయుటయు, గృహమునకు వచ్చిన యర్థికి సంతోషముతో బ్రియముసేయుటయు, వానికి చేసిన మేలును చెప్పకుండుటయు, తన కితరులు చేసిన మేలును సభల యందు బలుకుటయు, సంపదలు వచ్చినప్పుడు గర్వము లేకుండుటయు, ఇతరులను గురించి నిందగా మాట్లాకడపోవుటయు అను ఈ అసిధారావ్రతము సజ్జనులకు స్వభావసిద్ధము. ఒకరి యుపదేశమున వచ్చినది కాదు.

A vow to stand on the edge of a sword is of a great danger. A small mistake may cause harm to body and to life even. Such are the following deeds. Secret bestoweth, a harmonious treatment to guest, undisclosed help to needy, obedience during richness, non censuring others, are equal to stand on the edge of the knife (Asidharavaratam)

ఉ. నీరము తప్తలోహమున నిల్చి యనామక మై నశించు, నా
నీరమె ముత్యమట్లు నళినీ దళ సంస్థితమై తనర్చు, నా
నీరమె శుక్తిలోబడి మణిత్వము గాంచు సమంచిత ప్రభం
ఘౌరుషవృత్తు లి ట్లధము మధ్యము నుత్తముఁ గొల్చువారికిన్.

తా॥ కాలిన యినుముపైన పడిన నీటిచుక్క ఊరుపేరు లేక నశించిపోవును. ఆ బిందువే తామరపాకు మీద బడునేని ముత్యమువలె గనబడును. ఆ బిందువే సముద్రాంతర్గతమగు ముత్తెపు చిప్పయందు బడునేని మౌక్తికమణి యగును. కావున ఆశ్రయము ననుసరించినవారి కాయాశ్రయాను సారము నీచుల, మధ్యములు, ఉత్తములు అను పేరులు వచ్చును. అనగా వరుసగా సర్వనాశము, సౌఖ్యాభాసమును వాస్తవ సౌఖ్యమును కలుగును.

A friendship and a drop of water are equal in nature. If a drop of water falls on a hot-pan it gets vapour, if it falls on a lotusleaf it shines like pearl, if it falls on a coral it will become a pearl. Such are the friendships. If the friendship extended with the wicked the reprecations will be bad. If with the common man the effect will be common. If with the good the fruits will be good.
(Tell me the name of your friend I will tell your character)

చ. జనకుని బూజలం గడుఁ బ్రసన్నుని జేయునతండు పుత్త్రుఁ డే
వనిత మెలంగు భర్త్రు వశవర్తినియై యది సత్కళత్ర, మే
జనుఁడు విపత్తి సౌఖ్య సదృశక్రియుఁ డాతఁడు మిత్త్రుఁ డీ త్రయం
బును జగతిన్ లభించుఁ గడుఁ బుణ్యముఁ జేసిన యట్టివారికిన్.

తా॥ మంచినడవడిచేత దండ్రిని సంతోషపెట్టువాడే పుత్రుడు, భర్తకు హితము గోరునదియే పెండ్లము. ఆపత్సమయమునందును సంపదలయందును సమానముగ చెలిమిచేయునతడే మిత్రము. ఇట్టి పుత్రుడును భార్యయు స్నేహితుడును పుణ్యాత్ములకుగాని లభించరు.

Blessed the man who has got a dutiful son, a co-operative wife, a good friend who keeps friendship at all times.

or

The son who is dutiful, the wife who is co-operative, the friend that who keeps main fairs friendship at all times blessed. To have such a son, wife and friend are only the gift of God. Blessed such a man.

చ. నతులగుణున్ మహోన్నతి దనర్చుచు, నన్యగుణోక్తిచే గుణో
న్నతి బ్రకటించుచున్, బరజన ప్రియకార్యసమర్థతన్ సమం
చిత నిజకార్య సంగ్రహముం జేయుచు, నిష్ఠుర వాదులన్ క్షమా
ధృతి నిరసించుచుం, బరగు ధీరులు పూజ్యులు గారె యేరికిన్?

తా॥ సత్పురుషులు అణకువ గలిగియే ఔన్నత్యమును పొందుదురు. పరుల గుణములనే శ్లాఘించుటచేత తమ సహృదయత్వమును గనంబఱతురు. పరుల కార్యసాఫల్యమునకై ఎక్కువ ప్రయత్నించి వారి కార్యమును సానుకూలము చేయుచు తమ కార్యముల నొనర్చుకొనుచుందురు. తమ్మును కఠినముగ పరుషముగను నిందించు దుర్జనలయందు ఓర్పును గనంబరచుచునే వారిని దుఃఖపెట్టుదురు. ఇట్టి ఆశ్చర్య కరమగు నడవడి గల మహాత్ములెవరికి బూజ్యులు గారు? అందఱికిని బూజ్యులే.

Everyone regards the good. Who will not do so? Because the good has rich good nature, appreciating nature in others, extends his help to fulfil others needs, he execuses even harm creator and explains him softly there by, to means his ways.

తే. తరువు లతిరసఫల భార గురుతం గాంచు,
నింగి వ్రేలుచు నమృత మొసంగు మేఘుం
డుద్ధతులు గారు బుధులు సమృద్ధిచేత;
జగతి నుపకర్తలకు నిది సహజగుణము.

తా॥ వృక్షములు ఫలకాలమున నమ్రములై (వంగి) యుండును. నూతనాంబువులు గల మేఘములు బరువుచే క్రిందుగనే వ్రేలాడుచుండును. సత్పురుషులు సంపదలు వచ్చినప్పుడు గర్వము పొందరు. ఇది పరోపకారపరాయణుల స్వభావము. ఈ నమ్రత, క్రిందుగ నుండుట, గర్వము లేకుండుట అనునవి పరోపకారపరులకు సహజ గుణములు.

Trees bow down with fruits, clouds bow down with water. That the good rich will bow down. Such are the qualities of great people. Trees give us fruits, clouds water and rich (who is good) will help the poor.

తే. అమరుఁ జెవి శాస్త్రమున, గుండలమునఁ గాదు;
వలయమున నొప్పు, దీవిచే వెలయుఁ బాణి;
యురు దయాఢ్యులమేను పరోపకార
కలన రాణించు గందంబు వలనఁ గాదు.

తా॥ దయావంతులగు సత్పురుషుల చెవులకు శాస్త్రశ్రవణ మలంకారముగాని కుండలములు గావు. వారి హస్తములకు అలంకారము సత్పాత్రదానము గాని కంకణములు గావు. వారి దేహమున కలంకారము పరోపకారము గాని చందనము పూసికొనుట గాదు.

These are real ornaments, sandal wood scent to the kind and good man. Listening of several hymns to the ear, bestoweth to the hand, helping to the needy is to the body.





(63)

తే. ద్యుమణి పద్మాకరము వికచముగఁ జేయుఁ,
గుముద హర్షంబు గావించు నమృత సూతి,
యర్థితుఁడు గాక జలమిచ్చు నంబుధరుఁడు;
సజ్జనులు దారె పరహితాచరణ మతులు.

తా॥ సూర్యుడు ప్రార్థింపబడకయే తామర కొలనిని వికసింపజేయును చంద్రుడు ప్రార్థింపబడకయే కలువల వికసింపజేయుచున్నాడు. మేఘుడు యాచింపబడకయే నీటిని ఇచ్చుచున్నాడు. సత్పురుషు లెప్పుడు పరులకు హితమొనర్చుటయందే ఇష్టపడువారు.

Good people will attend the needy without any request. The Sun makes lotus blow, the Moon makes white water lilly happy and clouds rain to make people delight.

మ. తమ కార్యంబుఁ బరిత్యజించియుఁ బరార్థ ప్రాపకుల్ సజ్జనుల్,
దమకార్యంబు ఘటించుచున్ బరహితార్థవ్యాపృతుల్ మధ్యముల్,
దమకై యన్య హితార్థ ఘాతుకజనుల్ దైత్యుల్, వృథాన్యార్థభం
గము గావించెడు వార లెవ్వరొ యెఱుంగన్ శక్యమే యేరికిన్ ?

తా॥ తమ కార్యముల విడచి పరుల కార్యములను చేయువారు సత్పురుషులు తమ కార్యములకు భంగము లేకుండ పరుల కార్యముల నొనర్చువారు మధ్యములు. తమ కార్యము నిమిత్తమై పరుల కార్యమును చెడగొట్టువారు మనుష్యులలో రాక్షసులు. తమకు ప్రయోజనము ఏ మాత్రము లేకపోయినను పరులకు నష్టము చేయువారల కేపేరు పెట్టవచ్చునో నాకు తెలియుటలేదు. ఈ యుత్తమాది పక్షములలో నేది మేలయినదో దానిని ఆయుష్మంతుడగువాడు ఆశ్రయింపవలయు నని తాత్పర్యము.

The best will help others even keeping their works aside. The better will help others while doing their work. But the Devils will spoil other's work to make their work complete. But we cannot name the person who will spoil other's work without any aim.

తే. అఘము వలన మరల్చు, హితార్థ కలితుఁ
జేయు, గోప్యంబు దాచుఁ బోషించు గుణము,
విడువ డాపన్ను, లేవడి వేళ నిచ్చు;
మిత్రు డీలక్షణంబుల మెలంగుచుండు.

తా॥ చెడు పనుల నుండి వారించుట, మంచి పనుల జేయుటకు ప్రోత్సాహించుట, రహస్య సంరక్షణము, సద్గుణముల ప్రకటించుట, ఆపత్కాలమున విడువకుండుట, కాలముల కావశ్యక మగుదానిని ఇచ్చుట, ఇవి సన్మిత్రున కుండవలసిన లక్షణములు.

The perfect man should have three qualities. Shunning of bad deeds, venting of good deeds. Keeping secrets, Helping others in rainy days; and to be a friendly even in his hard days of his friend.

చ. క్షీరము మున్ను నీటికొసగెన్ స్వగుణంబులు దన్నుఁ జేరుటన్,
క్షీరము దప్తమౌటగని చిచ్చుఱికెన్ వెతచే జలంబు, దు
ర్వార సుహృద్విపత్తిఁ గని వహ్నిఁ జొరం జనె దుగ్ధ మంతలో
నీరముఁ గూడి శాంతమగు, నిట్టి మహాత్ముల మైత్రి యీగతిన్.

తా|| పాలు తనయందు గలసిన జలమునకు తన గుణములన్నియు నిచ్చెను. తన కిట్టిసాయ మొనర్చిన క్షీరమునకు గలుగు తపనమును గాంచి జలము అగ్నియందు బడెను. తనకు మిత్రమగు జలమగ్నియందు బడుటను చూచి క్షీరము తానుగూడ అగ్నియందు బడబోగా దానితో మరల జలము కలియుటచేత శాంతిల్లుచున్నది. సజ్జన సహవాసము ఇంతయే అని యర్థము.

The best example for good friendship is milk and water. When milk was boiled the water within the milk will be vapoured. The parting of water makes the milk unhappy and provokes the milk to jump in to the fire. To satisfy the milk, again water should be added. On seeing the return of water the milk will become normal.

చ. ఒకయెడఁ బవ్వళించుహరి, యొక్క యెడన్ వసియించు రాక్షస
ప్రకరము, లొక్కచోనడగు బర్వత సంఘము, లొక్కెడన్ బలా
హకములతోడనుండు బడబాగ్నియు, విస్తృత మూర్జితంబునుం
బ్రకటభరక్షమం బగుచు భాసిలు నౌర సముద్ర మెంతయున్.

తా॥ సముద్ర మనేక విధముల నాశ్చర్యకరముగానున్నది. ఎట్లన, ఒక ప్రక్క కడుపున పదునాలుగు లోకములు ధరించిన మహావిష్ణువు పరుండుటకును, వేఱొక ప్రక్క ఆ విష్ణు శత్రులగు కాలకేయాదు లాయన వలని భయములేక కాపురముండుటకును తగియున్నది. ఒక వంక ఇంద్రునినుండి తమ్ము గాపాడుకొనుటకు వచ్చిన మైనాకాది పర్వతముల గుంపును మోచుచున్నది. మఱియొక వైపున ప్రళయకాలమేఘములతో గూడి బడబానలము నీటి నెంత పీల్చుచున్నను అంత వర్ధిల్లుచున్నది. అట్లే మహాత్ములు ఎంతెంత వారికో ఆశ్రయభూతులుగా నుందురు.

An exalted personages are the shelters for great people. The ocean is the shelter for Lord Vishnu; who is within him 14 Lokas and even enimies. The Minaka mountain who requested the ocean to give shelter to get rid of Indra's Vajrayudha. The ocean gave shelter to inextinguishable fire that swallows the water that occurs by deluge. But the ocean stands still.

వ. వితత జగద్భరంబు దన వీపున దాల్చిన కూర్మనాథుడున్
సతతము చంద్ర భాస్కరుల చక్రముఁ ద్రిప్పు ధ్రువుందు సజ్జనుల్;
ప్రతిభ నజాండ జంతుఫల రంధ్ర వసన్మశకంబులట్ల నిం
దిత విఫలార్థ సంగతి జనించి నశించుఁ దదన్య జంతువుల్.

తా॥ విస్తారమగు సకల లోక భారమును భరించిన ఆదికూర్మము యొక్క జన్మమును, జ్యోతిశ్చక్రమును మేరువుపై నుండి భ్రమింపజేయుటకు ప్రధానుడగు ధ్రువుని యొక్క జన్మమును ఈ రెండే లెక్కింపదగినవి. తక్కిన వారందఱు పరోపకారము చేయజాలని వారగుటచేత ఆది కూర్మమువలె క్రిందను ధ్రువునివలె ఊర్ధ్వభాగమున లేక బ్రహ్మాండ మను అత్తిపండులోని పురుగుల వలె బుట్టి నశించుచున్నారు.

Two persons lives are treated as worthy ones. Rest are of useless ones. One is Dhruva who shines on Merupavatha and the Tortoise (Adi Kurma) who carries the Universe. The others lives are of a fig nature. The fig may looks sweet but with in the fig the worm are to be seen.

శా. ఆశా సంహరణంబు, నోర్మియు, మదత్యాగంబు, దుర్దోషవాం
ఛా శూన్యత్వము, సత్యమున్, బుధ మతాచారంబు, సత్సేవయున్
వైశద్యంబును, శత్రులాలనము, మాన్య ప్రీతియుం, బ్రశ్రయ
శ్రీశాలిత్వము, దీనులందుఁ గృపయున్, శిష్టాలికిన్ ధర్మముల్.

తా॥ అత్యాశను త్యజించి ఓర్పు కలిగి మదమును విడిచి దుష్కార్యములందు మనసును పోనీయక సత్యమునే పలుకుచు పెద్దలు పోయిన మార్గమున నడచుచు, విద్వాంసుల సేవించుచు, పూజ్యుల మన్నించుచు, శత్రువునైనను చక్కగ జూచుచు, పెద్దలయందు అడకువ కలిగి కీర్తికి భంగము రానివిధంబుగ చరించుచు, దుఃఖితుల యందు దయను గనబరచుచుండుము. ఇవి సత్పురుషుల లక్షణములు.

Be patience, be far from bad deeds, be a truthful man, be on rightful path, be helpful to sages, be humble towards good, forgive enemy, be obedient to elders do good deeds without hampering pelf, be helpful to the needy. These are the good qualities.

ఉ. హృదయ వచశ్శరీరముల నెంతయు బుణ్యసుధా ప్రపూర్ణులై
ముదము బహూపకారముల మూడు జగంబులకున్ ఘటించుచున్
పరులక సాధు సద్గుణలవంబులు గొండలు సేసి మెచ్చుచున్
మదిని వికాసయుక్తులగు మాన్యులు గొందఱు వొల్తు రిద్ధరన్.

తా॥ మనో వాక్కాయముల యందును సత్కర్మల నొనర్చుట యను అమృతము చేత పూర్ణులయి ముల్లోకములం దున్న వారికి ఉపకార మొనర్చుచున్నవారలయి పరులయం దుండిన అణువులవంటి సద్గుణముల నైనను కొండంతగా భావించి వికసించుచున్న హృదయములు గల సజ్జనులు కొందరు మాత్రమే యందురు.

The good people and the nectar are the same. They will do good and will be renownd by three lokas. They are always obedient to the sages (Mahatmas). They will regard even a small good quality in others.

తే. తనిసిరే వేల్పు లుదధి రత్నములచేత?
వెరచిరే ఘోరకాకోల విషముచేత?
విడిచిరే యత్న మమృతంబు వొడము దనుక?.
నిశ్చితార్థంబు వదలరు నిపుణమతులు.

తా॥ అమృతమునకై పాలసంద్రమును మథింపుచున్న దేవతలు అందలి రత్న లాభమునకు సంతోషింపక అందు పుట్టిన కాలకూట విషమునకు భయపడక అమృతము కలుగునంతదనుక..తమ పట్టును వదలరైరి. ధీరు లెప్పుడు తాము దలంచినకార్య మగునంత వరకు తమ ప్రయత్నమును వదలరు.

Hero will never tarry by the way. Even he get many hardles in the process of his good deeds. Like Suras who churned the milk-ocean in order to get nectar. During the process they had received poison. But they did not feared of the poison.

(72)

శా. ఆరంభింపరు నీచమానవులు విఘ్నాయాస సంత్రస్తులై,
యారంభించి పరిత్యజింతు రురువిఘ్నాయత్తు లై మధ్యముల్,
ధీరుల్ విఘ్ననిహన్యమానులగుచున్ ధృత్యున్నతోత్సాహు లై
ప్రారబ్ధార్థము లుజ్జగింపరు సుమీ ప్రజ్ఞానిధుల్ గావునన్.

తా॥ అధములు విఘ్నములు సంభవించునని కార్యము నారంభింప వెఱతురు. మధ్యములు ఆరంభించి విఘ్నములు వచ్చినప్పుడు వదలుదురు. ధీరు లెన్ని పర్యాయము లెట్టి విఘ్నములు వచ్చినను తాము పట్టిన కార్యమును విడువరు.

Hero's are always called first ranked persons. They will never do the work half done. They will struggle till they get the fruit of it. Second ranked persons will start the work and leave the same half done because of the hardels. But the third ranked persons will never start any work fearing about the hardels.

మ. ఒకచో నేలను బవ్వళించు, నొకచో నొప్పారుం బూసెజ్జపై,
నొనచో శాకము లారగించు, నొకచో నుత్కృష్టశాల్యోదనం,
బొకచోంబొంత ధరించు, నొక్కొకతరిన్ యోగ్యాంబర శ్రేణి; లె
క్కకు రానీయడు కార్యసాధకుడు దుంఖంబున్ సుఖంబున్ మదిన్.

తా॥ కార్యార్థియగు ధీరుడు వీలునుబట్టి ఒకచోట భూశయ్యయు, ఒకచోట పరుపులయందు శయనించుటయు, ఒకతావున కాయగూరల నారగించుటయు, ఒకచోటను శాల్యోదనంబు సేవించుటయు, ఒక తావున బొంతగుడ్డను కట్టుకొనుటయు, ఒకచోట పీతాంబరముల ధరించుటయు గలిగియుండును. కాని కష్టములు వచ్చిన వని దుఃఖమును గాని సుఖము వచ్చినదని సంతోషముగాని పొందడు.

Hero's are always finishes their job, even they will get good food or not, good shelter or not, good bed or not. They will never be overwhelmed when they get happy situation. They will not mind even if they will be in unhappy situation. Their ultimate-aim is to finish the work.

శా. నీతిప్రౌఢ విహారులైన నిపుణుల్ నిందింపనీ మెచ్చనీ,
ఖ్యాతిం జెందిన సంపదల్ నిలువనీ గాఢంబుగా సాగనీ,
ఘాతం బప్పుడ పొందనీ నియతిమై గానీ యుగాంతంబునన్,
నీతి శ్లాఘ్యపదంబు దప్పరు గదా నిత్యంబు ధీరోత్తముల్.

తా॥ నీతివేత్తలు నిందించినను భూషించినన సంపదలు వచ్చినను పోయినను మరణ మిప్పుడే కలిగినను కల్పాంతరమునకు గలిగినను ధీరులయినవారు న్యాయమార్గమును దాటి ఒక అడుగునైనను పెట్టరు.

The honesty will never get upset, even they have been insulted. Their nature will never be changed during richness or in poverty. They will care a pin for the death. Their nature will be always even. They will never deviate from their honesty nature.

ఉ. మానవతీ కటాక్ష శితమార్గణముల్ విదలింప జాల వె
వ్వానిమనంబు, కోపమయవహ్ని దహింపదు, లోభపాశ సం
తానము మాల్యచందన వితానములున్ వెతసేయ నోప కె
వ్వాని వశంబునన్ మెలగు, వాడు జయించు జగంబు లన్నియున్.

తా॥ ఎవని మనస్సు కామినుల చూపు లను బాణములచే క్షతము కాదో, ఎవని హృదయమును కోపాగ్ని దహింపదో, ఎవని మనస్సు అత్యాశ యను పాశములచే లాగబడదో అట్టి ధీరుడు ముల్లోకముల జయించును.

He who will not to be attracted by the sweet talks of the women, by illtemper, by covetnousness, he only can conquer the Universe.

తే. నియతి చేతఁ గదర్థితుం డయిన ధైర్య
పరుని ధైర్యగుణంబు మాన్పంగఁ దరమె ?
క్రిందు సేయంగ బడినట్టి కృష్ణపథుని
కీల యెందైన మీదుగాఁ గెరలుఁ గాదె!

తా॥ ధైర్యవంతునికి ఎట్టి దుఃఖము సంభవించినను అతని ధైర్యమును పోగొట్టుట అసాధ్యము. అగ్నిని తలక్రిందుగా పెట్టినను అగ్ని జ్వాల యూర్ధ్వముగనే ప్రసరించునుగాని అధోముఖముగ ప్రసరింపదు.

The fire, even we tilt it, it glows upwards only. Such is the nature of the brave people they will never loose their bravery even any obstrucles come in their way.

చ. ఉరుతర పర్వతాగ్రమున నుండి దృఢం బుగ దూఁకి స
త్వరముగ ద్రెళ్లి కాయము హతంబుగc జేయుట మేలు, గానిమే
పరిదారవాతc గే లిడుట బాగు, హుతాశన మధ్యపాతము౯
వర మగుc, జారుశీల గుణవర్జన మద్దము గాదు చూడగ౯.

తా॥ ఎత్తయిన పర్వత శిఖరము నుండి కఠినమయిన రాతిమీదపడి దేహమును వదలుటయు, భయంకరములగు విషజ్వాలల వెదజల్లు కోరలు గల ఆదిశేషుని నోటియందు చేతిని పెట్టుటయు. అగ్నియందు పడుటయు ఇవి ఒక పక్షమున మేలనవచ్చును గాని సత్ప్రవర్తనము విడుచుట మాత్రము మేలుగాదు.

Leaving good acts are worse than falling down from a high hill and loosing life, keeping the wrist in the mouth of Adiseshu (Old dragon) who spreads venom, falling down in the fire. The above three are only an ordinary things leaving good acts are worst than any thing.

చ. అతనికి వార్ధికుల్య యగు, నగ్ని జలం బగు, మేరుశైల మం
చితశిలలీల నుండు, మదసింహము జింక తెఱంగుఁ దాల్చు, గో
పితఫణి పూలదండ యగు, భీష్మ విషంబు సుధారసం బగున్,
క్షితి జన సమ్మతం బగుసుశీల మ దెవ్వనియందు శోభిలున్.

తా॥ ఎవడు సత్స్వభావము కలిగియుండునో, అట్టివానికి అగ్ని జలమువలె చల్లగను, మేరు పర్వతము చిన్నరాతివలెను, సింగము జింకవలెను, సర్పము పూలమాలవలెను, విషము అమృతమువలెను అగును.

Piousman treats fire as water, the Himalayas as pebbles, the tiger as deer, the small snake as garland and venom as nectar.

తే. ఖండితం బయ్యు భూజంబు వెండి మొలచు,
క్షీణు డయ్యును నభివృద్ధిc జెందు సోము,
డివ్విధమున విచారించి యొడలు దెగిన
జనములకు దాప మొందరు సాధుజనులు.

తా॥ సజ్జనులు, ఛేదింపబడిన వృక్షము మరల అంకురించుటయు, క్షీణించిన చంద్రుడు మరల వృద్ధినందుటయు గాంచుచున్న వార లయి తమకు దుఃఖము కలిగిన సమయమున సంతాపము నందరు.

For pious people the difficulties are momentary. Like the Moon. who will not be visible for some days and again he will be visible in full zoom.

ఉ. జానుగ భూతికిం దొడవు సజ్జన భావము, శౌర్య లక్ష్మికిన్
మౌనము, నీతి విద్యకు, శమంబు సుబుద్ధికి, విత్తవృద్ధికిన్
దానము, దాల్మి శక్తికిని, ధర్మనిరూఢి కదంభ వృత్తియుం
బూనికతోడ సర్వగుణ భూషణ మెన్నగ శీలమే సుమీ.

తా॥ సంపదలు కలిగి సుజనుడుగ నుండుటయు, శూరుడై మితభాషి యగుటయు, జ్ఞానముండి ఇంద్రియలోలత లేకుండుటయు, విద్యావంతుడై వినయము కలిగియుండుటయు, ధనముండి సత్పాత్ర యందు వినియోగించుటయు, తపస్వియై కోపము లేకుండుటయు, సమర్థుడై ఓర్పుండుటయు, నెపము లేక ధర్మము నొనర్చుటయు ఇవన్నియు వానికి అలంకారముతో సమానము. కనుక నాయైశ్వర్యాదులు గల వారికి ఆ సౌజన్యాదుల కంటె నిదియే మేలైన భూషణమని తాత్పర్యము.

The real ornaments to the pious and wholly man are ; be humble inspite of richness, polite eventhough he is brave, to be away from worldly attachments, humble even he has devine knowledge and other educational qualifications, to be helpful to the needy, to be a sage without anger, bestoweth whom so ever that approaches him.

చ. గురుడు గురుండు, వాలుశతకోటి, సుపర్వులు వాహినీపతుల్
సురభవనంబు గోట, మధుసూదనుడున్ సయిదోడు, దంతి ది
క్కరిపతి గాగనొప్పు బలఘాతియు దాయల కోడె నాజిలో;
శరణము దైవమే, పురుషశక్తి నిరర్థక మెన్ని భంగులన్.

తా॥ బృహస్పతి గురువై వజ్ర మాయుధమై దేవతలు సేనలోని వారలయి స్వర్గము కోటయై విష్ణుమూర్తి యనుగ్రహము గలవాడై ఐరావత గజము కలిగి ఈవిధముగ ఆశ్చర్యమును కలుగజేయుశక్తిగల ఇంద్రుడే శత్రువుల చేత యుద్ధమునందోడిపోయెను. కావున దైవబలమే ప్రధానముకాని పౌరుషమెందుకును పనికిరాదు.

The proud and bravery are not of any use. Indra, who pocess mighty sword (Vajrayudha) the learned scholor (Brihaspathy) the mighty elephant, (Iravatha) loved by Vishnu are of no use to Indra. He was defeated by Asuras. So the only powerful thing is God. (That means the Karma is powerful)

ఉ. రాతిరి మూషకంబు వివరం బొనరించి కరండబద్ధమై
భీతిలి చిక్కి యాస చెడి పెద్దయు డస్సినపామువాత సం
పాతముఁ జెందె, దానిఁ దిని పాము దొలంగె బిలంబుత్రోవనే;
యేతఱి హానివృద్ధులకు నెక్కటి దైవము కారణం బగున్.

తా॥ ఒక రాత్రియందు ఆహారార్థము యెలుక ఒక పెట్టెకు రంధ్రము చేసి అందులో దూరెను. అంతకుమున్ను ఒకపాము ఆ పెట్టెయందుండెను. ఇరకటము వలన దాని దేహము ముద్దయయి బయటికి వెళ్లుట ఇక లేదని నిశ్చయించుకొని ఆకలిచేత ఇంద్రియపాటవము దప్పి కృశించుచుండెను. ఆ యెలుక లోనికి ప్రవేశింపగానే సర్పము దానిని భుజించి ఆ యెలుక చేసిన రంధ్రమునుండి బయటికి పాఱిపోయెను. కావున వృద్ధి క్షయములకు దైవమే కారణము. మీరు నెమ్మదిగ నుండుడు.

The mouse makes a small hole into a big one throughout the night and sleeps there itself due to tiresom. The snake which already was there, will eat the mouse and run away through the big hole. So the richness and poverty are always comes and vanishes.

క. కందుకమువోలె సుజనుడు
గ్రిందం బడి మగుట మీదికి న్నెగయు జుమీ,
మందుడు మృత్పిండము వలె
గ్రిందం బడి యడగి యుండు గృపణత్వమునన్.

తా॥ చెండు క్రిందబడి మరల లేచునట్లు సజ్జనుడు హీనస్థితి నందినను వెంటనే ఉన్నత స్థితి నందును. మంటి ముద్ద క్రిందబడి యట్లే యుండునట్లు దుర్జనుడు హీనస్థితి నందిన యట్లే యుండును.

Even if a good person had fallen under the sapless stalks again he can come over from that stalks. But a bad man falls under the mud will never come out of the mud.

మ. ధర ఖర్వాటు డొకండు సూర్యకర సంతప్త ప్రధానాంగుడై
త్వరతోడన్ బరువెత్తి చేరి నిలిచెన్ దాళద్రుమచ్ఛాయఁ, ద
చ్ఛిరముం దత్ఫలపాత వేగమున విచ్చెన్ శబ్దయోగంబుగాఁ,
బొరి దైవోపహతుండు పోవునెడకుం బోవుంగదా యాపదల్.

తా॥ బట్టతలవాడొకడు మధ్యాహ్నకాల సూర్యుని వేడిమి చేత తన తల మాడుచుండుటకు దాళజాలక నీడగల ప్రదేశమును కోరి తాటిచెట్టు క్రిందికి బోయెను. దైవికముగ అప్పుడా చెట్టునుండి యొక పండు వాని తలమీద బడి వాని తల పటపటమని బ్రద్దలయ్యెను. దైవ బలము చాలని వాడెచటికి బోయినను అచటికే ఆపదలన్నియు బోవును.

The power of God is the only one that cannot be avoided by any one. The bald headed man ran under a palm tree to take shelter from Sun beams. But the palm fruit had fallen on the head of that man and broke his head.

తే. ఫణులు గజములు బక్షులు బట్టువడుట,
రవి సుధాకరులకు నైన రాహు బాధ,
బుద్ధిమంతుల లేమియు, బొసఁగ జూచి
విధి బలాఢ్యు డటంచు భావింతు మదిని.

తా॥ బంధింపశక్యముగాని గజ సర్ప విహంగముల యొక్క బంధనమును, సూర్యచంద్రాదులకు గల గ్రహపీడయు, బుద్ధిమంతులకు దరిద్రమును చూడ నామనంబునకు దైవప్రభావము బలవత్తరమని యభిప్రాయము. 

The power of the God is very powerful. Even mighty people cannot avoid the difficulties created by God. Elephant, snake, eagle are can be tied up. The Sun and the Moon are also victims of Eclipse. None can super-sede the God's desire.

క. గుణమణిఖని యగు పూరుష
  మణి ధరణికి రవణముగ నమర్చినవిధి యా
  గుణవంతుని వెసఁ దునిమిన
  గుణహీనునిఁ గాగ నెన్నుకొనరే ధాతన్.

తా॥ దైవము సకల సద్గుణ సంపన్నుడును భూమికి అలంకారుడును అగు పురుషవర్యుని నిర్మించియు వెంటనే వానిని నశింపజేయుచున్నది. అయ్యయో దీనికి దెలివి లేదు గదా!

God created human being who can be an ornament to the earth by way of his innovations. But the same God kills him. So to know God's actions are very difficult.

చ. శతభిష గాధ్యుడున్ సతత శంభువతంసము నయ్యు, నోషధీ
తతులకు నాథుడయ్యును, సుధారస సేవధి యయ్యు, దారకా
పతి దనరాజ యక్ష్మభవబాధలఁ బాపగ నోప డక్కటా!
హతవిధి కృత్య మెవ్వనికి నైన జగంబున దాటవచ్చునే!

తా॥ ఈ కనబడు చంద్రుడు అమృతమునకు స్థానము. సకలౌషధులకు రాజు. నూర్గురు వైద్యులు వెంటనే యుందురు. జగత్పరిపాలకుడగు శివునికి దాను స్వయముగ నలంకారము. ఇట్టి చంద్రుని సైతము క్షయరోగము బాధించుచున్నది. దైవ విధి దాటుటకు ఎవడును సమర్థుడు కాడు.

The Moon has got all sorts of herbs nectar. He is an ornament to Lord Siva. Yet he suffers from tuberculosis. So Gods decession cannot be avoided.

చ. కవిత విపత్తి దండపద ఘట్టనసేయుచు మన్నుకైవడిన్
ఖలుడు విధాత పిండితముగా నొనరించి నితాంత చింత యన్
బలితపు సారెపై నిలిపి పాయక డెందము ద్రిప్పుచున్న వా
డలమి కులాలురీతి దెలియం గలవారమె యేమిసేయునో?

తా॥ ఈ పాపిష్టి దైవము గడితేరిన కుమ్మరివలె నామనస్సును ముద్దచేసి విపత్తు లనియెడి కొయ్యలచేత నెల్లప్పుడు గొట్టుచు చింతయను చక్రమున ద్రిప్పుచున్నాడు. ఏమి చేయుట కిట్లు చేయుచున్నాడో తెలియుటలేదు.

God makes human being's brain as mud and beats badly like a potter and puts it in the wheel of bondage. I am not in a position to judge why (God) he does all these things.

(89)

చ. దొసగులు వచ్చువేళ గుణ ధుర్యులధైర్యగుణంబు సర్వముం
బస చెడు నంచు జూచెదవు పాపపు దైవము, యీ దురాగ్రహ
వ్యసనము మానుమాను, ప్రళయంబున వీతనిజక్రమంబు లై
ససి సెడ వించు కంతయును సాగరముల్ గులపర్వతంబులున్.

తా॥ ఓ తెలివిలేని దైవమా! మహాత్ములకు ఆపదలను కలిగించు వారిధైర్యమునకు భంగము కలుగజేయ జూచుచున్నావుగాని ఇది సాధ్యముగాదు. కల్పాంతమునన్నైనను కుల పర్వతములు సప్తసముద్రములును తమ మేరలు తప్పునట్టి నీచములు కావు కదా?

No hardiles, created by the God to the great people, can stop their good deeds. The great people like ocean. Meru will have no change even at the time of Deluge.

తే. ఎవ్వనికి నిజ్జగంబున నెంత ఫలము
దైవకృత మగునది వొందుం దప్ప కతనిం,
గారణము గాదు పెనుబ్రాపు ఘనుని జేరు
చాతకమువాత బడు నల్పజలకణములు.

తా॥ ఎవని కెంత యని దైవము నిర్ణయించునో అయ్యది వానికి అనంతటనే దొరకును. దీనికై ఒకరి నాశ్రయింప నక్కరలేదు నలు దిక్కులు వ్యాపించి మేఘము ప్రత్యహము వర్షించుచున్నను చాతకము నోటియందు సూక్ష్మ బిందువులు రెండోమూడో పడునుగాని ఎక్కువ పడవుగదా? అన్నిటికిని దైవము నియామకముగాన తక్కిన మన యాశ్రయములు ఎంత పెద్దవైనను మనకు కల్గుఫలము అంత పెద్దవిగా నుండునని తలపరాము కావున దైవమే శరణము.

God has decided every one's share on the earth. Even a great struggle done by human being, he will not get more than what has allotted by God. It is like that the black, cuckoo can only have one or two rain drops though there is a heavy rain.

చ. శిధిలత లేనిభక్తి నతిసేయుదు వేల్పుల, కానువర్వ్రులున్
విధివశవర్తు, లావిధియు విశ్రుత కర్మఫల ప్రదాత, య
య్యధికఫలంబు కర్మవశ, మట్లగుటం బనియేమి వారిచే?
విధి కధికంబు గర్మ మని వేమఱు మ్రొక్కి-భజింతు గర్మమున్.

తా॥ దేవతలకు నమస్కారము వారు సైతము పాడు దైవమునకు లోబడినవారుగాన దైవమునకు మ్రొక్కెదను. ఆ దైవము కర్మానుసారముగ ఫలము నిచ్చునుగాక కర్మకు నమస్కారము ఫలము కర్మాధీనము గావున దేవతల తోడను దైవముతోడను మాకేమి? దేవతల చేతను దాట శక్యముగాని కర్మమునకే మ్రొక్కెదము.

Nobody is above to God, Even suras are also have to obey the decision of the God (Karma). So the Karma is above to all. My prayers go to God (Karma).

చ. నలువ కులాలు భంగి నలి నప్ర భవాండమునందు దేనిచే
నిలిచె, దశావతారవననిష్ఠితుడయ్యె మురారి దేనిచే,
బెలుచc గపాలహస్తుడయి భిక్షకుడయ్యెc బురారి దేనిచే,
నల రవి దేనిచే దిరుగు, నాఘనకర్మము వంద్యమే కదా.

తా॥ బ్రహ్మ దేనిచేత గుండవలె నుండు బ్రహ్మాండ మధ్యమున నుండ నియోగింపబడెనో, దేనిచేత విష్ణువు పది యవతారము లెత్తుటయను కష్టమునకు బాల్పడెనో, రుద్రుడు దేనిచేత పుర్రెను పాత్రగా గొని బిచ్చగాడై దిరిగెనో, దేనిచేత సూర్యుడు ఆకాశమున సర్వదా తిరుగుచుండునో అట్టి సర్వనియమనశక్తి గల కర్మకు నమస్కారము.

Karma is above all. Brahma was asked to be in the midst of universe which shapes like carthem pot, even Lord Vishu has to take ten Avataras. Lord Siva has to go for begging with a skull in his hand. Sun has to work restlessly. So every one has to suffer according to their Karma.

మ. ఖలునిన్ సజ్జనుఁ గాగ, మూర్ఖజను సంఖ్యావంతునింగాగ, దా
యల సన్మిత్రులగా, నగోచరము ప్రత్యక్షంబుగాఁ, బ్రాణ హృ
త్కలనంబైన మహా విషం బమృతముంగాఁ, జేయసత్కర్మ ము
జ్జ్వల నిష్ఠానిధివై భజింపుము వయస్యా వాంఛితార్థాప్తికిన్.

తా॥ ఓయి నేర్పరీ! నీవు కోరిన కోర్కెలను పొంద దలచితివేని దుర్జనుల సజ్జనులుగను, మూర్ఖుని విద్వాంసునిగను, శత్రువుల మిత్రులుగను, ఇంద్రియాగోచరమును గోచరించుదానిగను, విషము నమృతముగను, జేయజాలిన సత్కర్మము నారాధింపుము. ఇతర విషయములకయి పాటు పడకుము.

Oh wise! if you wishe to acquire the desired one, you should treat a fool as a wise, wicked as a good, a foe as a friend, a poison as a nectar.

చ. లలితనికేతన ప్రియ విలాసవతీ ధవళాత పత్ర స
ద్విలసిత వైభవం బనుభవింపబడున్ సుకృతానువృత్తిచేఁ,
జెలు వగు పుణ్యకర్మము నశించిన నంగజసంగరత్రుట
త్కలిత గుణోరుమౌక్తికని కాయములట్లు దొలంగు సంపదల్.

తా॥ మంచికర్మ యుండునేని మంచి మేడలు, విలాసవతులగు జవ్వనలును, ఏకచ్ఛత్రాధిపత్యముగల రాజ్యలక్ష్మియు నివి మొదలగు నవి కలుగును. అసత్కర్మ తొలగునేని మేడలు మొదలగు సకల సంపదలు మిక్కుటమైన రీతికేళియందు తెగిన ముత్యాలపేరులోని ముత్యముల వలెనలుగడల జెదరిపోవును.

The good deeds done by a person will fetch him with palaces, Kingdom and with cutes. The bad deeds done by a bad person will make him poor like that the untied chain from where the pearls will be scattered.

తే. సగుణ నిర్గుణ కార్యముల్ సలుపు సుమతి
సేత పరిణతి గదుఁ బ్రతీక్షింప దగును,
బరుషకర్మ విపాకంబు ఫలము దనుక
హృదయము దహించు శల్యంబు రీతి జగతి.

తా॥ పండితుడగువాడు మంచిదో చెడ్డదో యగు నొక కార్యమును చేయబూనునేని ప్రయత్నముగ నాలోచింపవలయును. [illegible] అతిత్వరగ ఆలోచింపక చేసిన కార్యముల యొక్క ఫలితము మరణ పర్యంతము శల్యమువలె బాధించును.

Wiseman should be careful in taking up a Job. He should be careful in selecting the bad and good. If he is not careful and hasty in doing so, the bad deed may (persue) punish him till to his death.

మ. వెలు వౌరత్నఘటంబునం దతడు సుశ్రీఖండంబులం
దిల పిణ్యాకము వండె, నారుగల కర్ధిన్ సప్తపర్ణావృతుల్
నిలిపెన్, జిల్లెడు దూదికై పుడమి దున్నెన్ బైడి నాగేళ్ళ,ని
మ్మిల గర్మక్షితి బుట్టిఁ యెవ్వడు దపంబుల్ సేయ డప్రాజ్ఞతన్.

తా॥ కర్మభూమి యగు ఈ భరత ఖండంబున జన్మించియు ఎవడు తపము నాచరింపడో అట్టి భాగ్యహీనుడు వైడూర్యమణిచేత నిర్మింపబడిన వంట కుండ యందు మంచి గంధపు కట్టెలతో తెలికపిండిని వండు వానితోడను, జిల్లేడు దూదికొఱకు బంగారు నాఁ గలితో భూమిని దున్నువాని తోడను, కర్పూరపుటరంటుల నరికి వానితో ఆళ్ళకు కంచెవేయువానితోడను సమాను డగును. అనగా శ్రేయస్సు గోరువాడు సర్వ విధముల సత్కర్మము ననుష్ఠింపవలయునని భావము.

India is a Karma Bhoomi. He who was born should perform tapa. If not, he is equal to fool of an ass. Is there anybody that cooks food in the pot embossed with gems, preparing oil cake by burning sandal wood, making fence out of Camphor (Karpooram)? He who will not do tapa (Karma Yoga) claims the above ranks of fool's activities.

తే. రమ్యరూపంబు విద్యయు రాజసేవ
కులము శీలంబుఁ జాలవు ఫలమొసంగఁ
బూర్వ పుణ్య సంచిత భాగ్యములు ఫలించుఁ
గాలమునఁ బనసాది వృక్షముల కరణి.

తా॥ పురుషునకు ఆకారముగాని కులముగాని స్వ[illegible]
ప్రయత్న పూర్వకముగ చేసిన సేవగాని ఫలము [illegible]
పూర్వకృతమయిన తపస్సువలన గలిగిన భాగ్యమే [illegible]
వానివాని కాలము వచ్చినపుడు ఫలమునొసంగును. [illegible]
తపస్సు చేయవలసినది.

Handsomeness, caste, god education and good behaviour are all gifits only. But not by means of efforts he will get. The good deed that has done by him in his previous birth will give him all such good qualities in this birth.

తే. సలిలం జొచ్చినం, గనక శైలము జేరిన, వైరి వీరులం
గెలిచిన, రాజసేవc దిలకించిన, వేదము లభ్యసించినం
గళల తెలుం గెఱింగిన, ఖగత్వము దాల్చినc, గర్మనిష్ఠతా
కలన నభావ్యమైన పనిగాదు వినాశము లేదు భావికిన్.

తా॥ వర్తకము చేయుట, పైరు పెట్టుట, కొలువు కొలుచుట మొదలగు పనలెన్ని చేసినను, ఎన్ని విద్యలు చేర్చినను, ఎంత కష్టపడినను అదృష్టము లేక యేమాత్ర ఫలమును గలుగదు, మంచి యదృష్టము గలిగిన ఎడల వానికి ఫలము గలుగనీయక యడ్డుపడుటకు నెవరికిని సాధ్యముగాదు. (అది కలుగనున్నదికాదు కాబట్టియే నీళ్లలో మునుగుట మున్నగుపాట్లు పడినను కలుగ జాలదని యాశయము)

When fortune has not favoured, any activity like doing business cropping or doing many activities will never fetch him. If fortune favours nothing can stop his prosperity.

క. కాననమున రణమున నలి,
అలానరిపు మధ్యమున మహాబ్ధి నగా గ్ర
స్థానమున మత్తు నిద్రితుఁ,
బూనికతోఁ బూర్వ పుణ్యముల రక్షించున్

తా॥ పురుషుని అడవియందును, యుద్ధమునందను, శత్రువుల మధ్యను, నీళ్లలోను, నిప్పునను, మహాసముద్రమునను, కొండచివరను, నిదురలోను, కైపులోను, అపాయమునను పురాకృత సుకృతములు వానికి చెఱుపు కలుగనీయక కాపాడును.

The good Karma done by a person in his previous birth will save him even if he is amidst of the forest, battle field, enemies, water, fire, sea, peak of the mountain. He will be free from all the above dangers.

(100)

తే. భువనమున ఁ బూర్వసంభృత పుణ్యరాశి
యుగుచు నుదయంబు గాంచిన సుగుణ నిధికి
వనము పురముగుఁ బరు లాత్మజనము లగుదు,
రవని నిధిరత్న పరిపూర్ణ యయి ఫలించు.

తా॥ ఎవనికి తొలుత సంపాదింపబడిన యనల్పమైన పుణ్యముండునో, వానికి భయంకరమైన యడవియును భోగార్హ మగు నగరమగును. పెరవారెల్లరును బంధువులగుదురు. భూమి యంతయు రత్నపు గనులతోడను మంచి వస్తువుల తోడను నిండినదై యుండును.

The holideed that was done by a person though it was small, will make him happy. For him every bad man looks good, earth looks like diamond mines, He feels everything is good.

# వేమన శతకము

పూజ చక్కజేసి పుణ్య మార్జించిన
పూజ్యుడైన గురువు పూజవలన
తేజ మెల్లగాంచి తిరుగ డెన్నటికైన
విశ్వదాభిరామ వినురవేమ.

The worshipful teacher who by the due performances of worship hath attained merit. He by that worship shall see (i.e., obtain). Never shall he be changed.

సద్గురుకృప జ్ఞానంబున
సద్గతి దీపింపుచున్న చాలా చదువుల్
సద్గతి గలుగగ జేయును
సద్గురువే దైవ మనుచు జాటర వేమా.

It is the favour of the excellnt teacher and through much study that is illumed with knowledge and (good conduct) ethics, that shall put thee into right path. Teach men that the excellent teacher is himself a part of the Divinity.

విన్నవానికన్న కన్నవాడధికుండు
కన్నవాని కంటె కలియువాడు
యున్నతోన్నతు డయి యుర్వి లోపల నుండు,
విశ్వదాభిరామ వినురవేమ.

He that has seen is greater than who has heard. But he that possesses Him is greater than who hath beheld. Greatest of the noble is he in the earth.

తననీడ తనకు శత్రువు
తననీడే తనకు సాక్షి తన దేహములో
తనవారే తనకు శత్రులు
తనమనసే తనకు తోడు తథ్యము వేమా.

Our own shadow is our foe, and our shadow is a witness to us of our bulk in the body; my passions are my enemies and my mind is the only aid I have. This is ture.

తల్లి నెరుగువాడు దైవంబు నెరుగును
మన్ను నెరుగువాడు మిన్ను నెరుగు
మిన్ను మన్నెరిగిన తన్ను దానెరుగురా
విశ్వదాభిరామ వినురవేమ.

He that knows his mother knows the deity. He that knows the earth knows heaven. He that knows heaven and earth knows himself.

చదివి చదివి చదివి చదివియు చదివియు
చదివి చదివి కొంత చదివి చదివి
చదువులోని మరుగు చదువ లేడాయెరా,
విశ్వదాభిరామ వినురవేమ.

Reading reading, reading still reading and still reading. Reading and reading, reading, some reading yet he cannot read so as to discern the great secret.

ఉదకము లోపలి తత్వము
వెదకియు దా దెలిసి చాల వేగమె మదిలో
నుదకమువలె దా దత్వము
మది దెలిసిన వాడె తత్వమయుడుర వేమా.

He who investigates in water the element (of fire) and ascertains it with delight in his mind-this man is like water of elemental nature. (awfully difficult)

ఆరయ నేడు త్రాళ్ళ నఖిల జగంబులు
కట్టబడుచు నుండు నెట్టు లన్న
జ్ఞాన ఖడ్గమునను పూని కోయవలయు
విశ్వదాభిరామ వినురవేమ

Behold the world is bound with the seven cords of passions. Strange! with the sword of knowledge let us strive to sever them.

పుట్టలోని తేనె పుట్టిన రీతిని
గుట్టమీద మణియు పుట్టువిధము
కట్టెలోన నగ్ని పుట్టిన విధమున
బుట్టి పెట్టవలెను భువిని వేమ.

Like as honey is produced in a hillock (or ant-hill), like as a ruby is produced on hill, like as fire is produced in a stick thus produced in the earth let a man bestow on others.

కదువబెట్టుదారి కొంత పద్దుకు నష్టి
పరగ నందు మీద బ్రతుకు నష్టి
పట్టు వారికి నొక తుష్టి గలదు భువి
తుష్టికాస జేసి త్రుంగు వేమ.

He who mortgages, suffers a certain loss. he loses part of his living. The acceptor of the pledge derives satisfaction therefrom. But he is ruined if he begins to covet it.

మతము లెన్ని యైన సతముగా నుండవు
సతముగాను యుండు జగతి నొకటి
యంతమతము విడిచి నాబ్రహ్మ మరయుట,
విశ్వదాభిరామ వినురవేమ.

Numerous as creeds be they are not permanent in the earth. Truth is but one in the earth. It consists in leaving every creed and be-holding the very deity.

తల్లితండ్రు లెన్న తన మొదలిగురులు
పార్వతీభవులును పరమ గురులు
కూలి కాండ్ల జగతి గురులన ద్రోహంబు,
విశ్వదాభిరామ వినురవేమ.

Consider that thy mother and father are thy first instructors; Parvati and Siva are the greatest of teachers. It is a shame to call those teachers who are hired.

నూరు యాడవచ్చు నొకటి వ్రాయగరాదు
వ్రాతకన్న సాక్షి వలవ దెన్న
పరగ వ్రాతలేవి పక్షాన నప్పుడు
బలిమి సాక్షి తగ నిబద్ధి వేమ.

You may speak a hundred words but beware of wrting down one. No evidence is required if the writing is produced. But in case writing is wanted then indeed good witnesses are required. (easy, pure Telugu),

కుక్క నందలమున కూర్చుండ బెట్టిన
నొక్క మనసుతోటి నుండలేదు
యాత్మ నిల్పలేడు యజ్ఞానచిత్తుండు
విశ్వదాభిరామ వినురవేమ.

If you seat a dog in a royal sedan, it cannot remain fixed in one mind. Thus cannot the man of ignorant mind restrain his soul.

కాశియాత్రబోయి గంగదానము చేసి
కష్టపడిరి ముక్తిగానలేక
నెనుము తిరుగుచుండదే యెద్దు వెంబడి,
విశ్వదాభిరామ వినురవేమ.

By going a pilgrimage to Banares, and bathing on the Ganges ye indeed suffer hardship but shall never attain heaven. No more than a buffalo calf can resemble a cow by merely following about it.

హింస జేయకుంటయే ముఖ్యధర్మంబు
యనక హింస జేతు రవనిసురలు
చావుపసిని దినెడు చండాలుడే మేలు,
విశ్వదాభిరామ వినురవేమ.

The height of excellence is to abstain from slaying. Thus say the Bramins, lords of earth and still commit slaughter of animals in sacrifice. Better is the *chadala* who devours dead cattle.

ఎంత కడుగ నోటి యెంగిలి బోవునా
యనృత (?) విడునోరు యదియు నోరు
యనుదినంబుచూడ యనృత మాడెడి నోరు
నోరు కాదు కిందినోరు వేమ.

However much you wash it well, does the defilement of the mouth depart? That alone is a mouth (Which does not speak falsehood); That daily speak falsehood is not a mouth but a mouth below.

గువ్వ కొరకు మేను గోసిచ్చి శిబిరాజు
వార్తకెక్కె చాల వన్నె కెక్కె
యోగు నెంచబోరు యుపకారి నెంతురు
విశ్వదాభిరామ వినురవేమ.

King Sibi cut a piece out of his body to give for a dove to a hawk. He became the topic of report and attained fame. They will not esteem him who is wicked, but will praise him who is charitable.

కోపమునను ఈల కొరికెను శేషుండు
కోపమున దపనుడు క్రూరు డాయె
కోపమునను యగ్ని కొంచె మాయె బవలు
కోపమెవరికి బని గొనదు వేమ.

Why did Sesha, king of serpents gnash his teeth with rage. Why did Surya through anger become cruel? By anger Vulkan became diminished in day light. Anger is unprofitable to any man.

దానములను యన్నదానము దొడ్డది
గానములను పామగాన మెచ్చు
ధ్యానములను శివుని ధ్యానము శ్రేష్ఠము,
విశ్వదాభిరామ వినురవేమ.

Of gifts, the gift of food is the noblest. In music, the melody of the Sama Veda is the sweetest. In meditation that of Siva is the noblest.

మంద బుద్ధి సొమ్ము మట్టిలోనే దాచి
మంటి కుండలోన మరల వండి
మంటి బ్రతుకు కింత మరు పేల జేసెదు,
విశ్వదాభిరామ వినురవేమ.

Stupid fools are they who hide their wealth in the earth, and again dress their food in the earthen vessel of the body. Why should ye be so [illegible] for this muddy life?

పూడ్చి పెట్టిన సొమ్మెల్ల భూమిపాలు
బైల నుంచిన సొమ్మెల్ల పరులపాలు
తిండి కొచ్చినసొమ్మెల్ల తినుకుపాలు
దాన మిచ్చిన సొమ్మెల్ల తనకు వేమ.

All wealth that is buried falls to the share of the earth; all that is out falls into the hands of others; all that we eat is the gain merely of straining inner system; what is bestowed alone remains ours

ఒంటి కాల నిలువ యోగీశ్వరుడు గాదు
నెత్తి పేడబెట్ట తొత్తుగాదు
కన్నవారి జూడ కన్నెర్ర జేసురా,
విశ్వదాభిరామ వినురవేమ.

A fellow on one leg is no saint. If one carries cow-dung she is no slut, if one sees either of these he is merely astonished (his eyes redden).

స్వానుభూతి లేక శాస్త్రవాసనలచే
సంశయంబు చెడదు సాధకునకు
చిత్రదీపమునను చీకటి చెడనట్లు
విశ్వదాభిరామ వినురవేమ.

Without self possession the mere favour of learning will never remove the doubts of the aspirant. No more than darkness will be dissipated by a painted flame.

శాంతమున సకల కార్యము
సంతోషంబునను బొందు సత్యము జయమౌ
పంతము జెల్లును ధర్మజు
డెంతేసి ప్రయాసముల జయించెను వేమా.

By gentleness every object is pleasantly attained. It is a true victory; by it our vows are performed, I will lay you any bet. How great were the difficulties that Dharmaraj conquered by means of gentleness? (admirable and easy),

ఉప్పులేనికూర యూసనరుచులకు
చెప్పులేనివాడు చెడ్డవాడు
యప్పులేనివాడు యధిక సంపన్నుండు
విశ్వదాభిరామ వినురవేమ.

Vegetables without salt are to the taste vile as (salt ground) barren land. A ruined wretch is he that hath no shoes and the man out of debt is the richest of the wealthy.

అకొన్న యతిథి శివుడని
కాకించుక లేక మదిని కరుణాన్వితుడై
పోకంత యన్న మిడినను
యూకొని యా యముని గొట్టియుపమరి వేమా.

He who being charitable in his mind considers the hungry guest as God, and without the least heat (displeasure) gives him a mouthful (as much as a nut) of food, this is the man who can cry avaunt to yama (death) and slay him.

తల్లి దండ్రి హితులు తగిన చుట్టంబులు
నెల్లవార లెల్ల యేరికోరి
బాలుని గనుజూచి పడుచు నిత్తురు గాని
భాగ్య మివ్వలేరు పరగ వేమ.

Mother, father, friends and relations, and all others will seek and desire a young man. They will give him th girl but not fortune with her.

# రోహిణి పబ్లికేషన్స్, రాజమండ్రివారి ప్రతిష్ఠాత్మక ప్రచురణలు

★ "ఆంధ్రా షేక్స్పియర్" **పానుగంటి లక్ష్మీనరసింహారావు** గారి శృంగార, హాస్య నాటకములు : **కంఠాభరణం, రాధాకృష్ణ, కోకిల, విప్రనారాయణ.**

★ లక్ష్మీప్రసన్నం కొఱకు సంస్కృతంలో వెంకటాధ్వరి విరచిత గ్రంథం **"అష్టలక్ష్మీసహస్రమ్"**కు ఆంధ్రానువాదం **"అష్ట లక్ష్మీప్రసన్నం".**

★ నవ్యాంధ్ర సాహిత్య నిర్మాత **శ్రీ కందుకూరి వీరేశలింగం**చే బాలబాలికల కొఱకు రచించబడిన కథలు **"నీతి కథా మంజరి".**

★ పరవస్తు **చిన్నయసూరి, కందుకూరి వీరేశలింగం**గార్ల విరచిత **"సంపూర్ణ నీతి చంద్రిక"** (1/8 డెమ్మీలో 300 పేజీలు).

★ అన్ని తరగతుల విద్యార్థులకు ఉపయోగపడు **"ఇంగ్లీషు గ్రామరు", "హిందీ వ్యాకరణము".**

★ ప్రాచీన ఆయుర్వేద యోగములతో, అనుభవ **"ఆయుర్వేద చికిత్సా విధానము".**

★ కలిదోష నివారణ కొఱకు నిత్యపారాయణ గ్రంథం"నల దమయంతుల కథ".

★ బమ్మెర పోతన భాగవతంలో అంతర్గత భావ సౌందర్య వ్యాఖ్యాన గ్రంథము **"పోతన భాగవత రత్నాలు".**

★ ప్రముఖ సంఘ సంస్కర్త వీరేశలింగంగారి ప్రఖ్యాత హాస్య నవల **"సత్యరాజా పూర్వ దేశ యాత్రలు".**

★ లోకజ్ఞతకు, భాషా జ్ఞానానికి ఉపయోగపడు **"నీతి శతక రత్నావళి"** (ఆంధ్ర-ఆంగ్ల తాత్పర్య సహితము)

